శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక

(వార్షిక సంచిక)

## Journal of the Telugu Academy

KAKINADA.



దేశభాషలందు దెలుఁగు లెస్స.



సంపుటము ౪[illegible] సంచిక ౬

" ౪[illegible] " ౧

# సంపాదకవర్గము

ప్రధాన సంపాదకులు :

కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర, శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి.

సహాయ సంపాదకులు :

ఐతిహాసికసమాలోచక, విమర్శకాగ్రేసర, శ్రీ బండారు తమ్మయ్య.

# విషయసూచిక

శ్రీ

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక

(Journal of the Telugu Academy)

చందా సంవత్సరమునకు మూఁడు రూపాయలు

సంపుటము ౪౬ } హేవిలంబి మాఘ, ఫాల్గుణములు { సంచిక ౬
" ౪౭ } విలంబి చైత్ర, వైశాఖములు { " ౧

1200
4

## సంపాదకీయము

ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక కొన్నిమాసములనుండి ప్రచురింపఁబడకుండుట కనేకాంతరాయము లేక కాలమునఁ బుంజికొనినవి. పరిషత్ప్రధాన కార్యదర్శిగారు తమపదవికి విరమణాభ్యర్థన పత్రముఁ బంపి స్వగ్రామమున కేఁగిరి. సంయుక్త కార్యదర్శియుఁ గోశాధిపతియు నగు శ్రీమాన్ ప్రతివాది భయంకర పార్థసారథిగార కాలమరణము నకుగురియైరి. ఈసమయముననే "పరిషత్తు మేనేజరు" తమపదవికి స్వస్తిచెప్పి దూరస్థమగు స్వగ్రామమునకు వేంచేసినారు. పత్రికా ప్రధాన సంపాదకులును "విరమణాభ్యర్థన" పత్రమును బరిషత్తునకుఁ బంపిరి. పరిషద్దైనందిన కార్యక్రమములో పాటుగఁ బత్రికా ప్రచురణ కృత్యములును స్తంభించినవి.

అంతఁ బరిషదధ్యక్షులు కవిసార్వభౌమ శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు కాకినాడవిచ్చేసి నిరుత్సాహముతోఁ బరిషత్పరాఙ్ముఖులయియున్న కార్యనిర్వాహక వర్గమును సమావేశపఱచి సమీత్యకారులై యందఱ యంగీకృతితో శ్రీమంతులును, సారస్వతాభిలాషులును, కార్యనిర్వహణ దక్షదక్షులును, కాకినాడ పురపాలక సంఘాధ్యక్షులును నగు శ్రీదంటు భాస్కరరావుగారి నంగీకరింపఁజేసి

ప్రధానకార్యదర్శి పదవీభారము నాయనపై నిడిరి. వెంటనే పరమో త్సాహముతో శ్రీ దంటు భాస్కరరావుగారు పరిషద్వార్షికోత్సవము మహావైభవముగా జరిగించి భారతోపాధ్యక్షులగు శ్రీ శ్రీ శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణ పండితుల నాహ్వానించి వారిచే శ్రీసూర్య రాయాంధ్ర నిఘంటువు 5,6 సంపుటముల నావిష్కరింపజేసిరి. పరిష ద్వార్షికోత్సవము దినద్వయమును విజయవంతముగ నెఱవేఱినది. వివిధ ప్రాంతములనుండి పలువురు పండిత ప్రకాండులు విజయంచేసి సభాకార్యక్రమమును విజయవంత మొనరించిరి. సర్వవిధముల బల హీనుఁడనగు నా శిరముపైఁ బరిషత్పత్రికా సంపాదకతా మహాభార మును బరిషత్తు నిర్దాక్షిణ్యముగా మోపినది. కేవల సారస్వత చపలతచే నా యశక్తిని గణింపక యిక్కార్య నిర్వాహకత్వమున కియ్యకొంటిని. ఇటఁబట్టి పత్రికలు సకాలమున మీకరకమలముల నలంకరింపగలవని మనవిచేయుచున్నాఁడను.

ఇట్లు-విధేయుఁడు.
సంపాదకుఁడు.

ఆంధ్రసాహిత్య పరిషత్తు 45వ వార్షికోత్సవ మహాసభలు జూన్ 12, 13 తేదీలలో కాకినాడ నగరమునఁ బరిషత్కార్యాలయ మగు "సుందరరామభవన"మున దినద్వయమును "అభినవ వాగను శాసన" శ్రీమల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారి యధ్యక్షతను జరిగినవి. సభాధ్యక్షులు శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారును, పరిషదధ్యక్షులు ఆంధ్రాస్థానకవి శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారును, భారతోపాధ్యక్షులు శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణ పండితులును నుపన్యాస వేదిక నున్నతాసనముల నలంకరించిరి. పరిషత్పశ్చాద్భాగమున నిర్మితమైన పెద్దపందిరిలో సుమారు రెండు వేలమంది యాసనముల నుపవిష్టులైరి. దూరశ్రవణ యంత్రములు

పలుతావుల నమర్పఁబడినవి. శ్రీకొల్లూరి లక్ష్మీనారాయణావధానులు గారి వేదపఠనముతో సభ ప్రారంభమైనది. అధ్యక్షుల యాదిమోపన్యాసానంతరమున శ్రీ రాధాకృష్ణ పండితులచే నుపన్యాస పూర్వకమై ఘంటుక సంపుటావిష్కృతి సంతరింపఁబడినది. (12వ తేదీ) నాఁటిసభలో శ్రీ కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, జటావల్లభుల పురుషోత్తమము, దర్భా సర్వేశ్వరశాస్త్రి, కొల్లూరి సోమశేఖరశాస్త్రి విశ్వనాథ నరసింహము మొదలగు పండితకవులు వివిధ విషయముల నుపన్యసించిరి. పరిషత్ప్రధాన కార్యదర్శి శ్రీ దంటు భాస్కరరావుగారు కార్యదర్శినివేదికఁ బఠించి వందన సమర్పణము గావించిరి.

మఱుసటిదినమున "అభినవవాగనుశాస"నుని యధ్యక్షతనే శ్రీమదన్నమరామశర్మగారి దైవప్రార్థనముతో సభప్రారంభమైనది. శ్రీపేరి వేంకటశాస్త్రి, ద్విభాషి సోమనాథశాస్త్రి, వసంతరావు వేంకటరావు, రాంభట్ల లక్ష్మీనారాయణశాస్త్రి, బండారుతమ్మయ్య, ఏలూరుపాటి రామభద్ర చయనులు, తోకల భాస్కరరావు, ఓరుగంటి నరసింహయోగి, జమ్మలమడక మాధరామశర్మ, ఏనుఁగు తమ్మిరాజు, పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రి, హోతా వేంకటరామశాస్త్రి, గిడుగు సీతాపతి, వేదాంతకవి, రంప శంకరశాస్త్రి, భద్రిరాజు భాస్కరరాజు, మున్నగు పండితకవివరులు మహోపన్యాసములఁ గావించిరి. పరిషదధ్యక్షులచే నుపన్యాసకులకు సాలువులు బహూకరింపఁబడినవి. కార్యదర్శి వందనసమర్పణములతో సభ సంపూర్తి నందినది.

అధ్యక్షులయొక్కయు, వక్తలయొక్కయు నుపన్యాసము లీ పత్రికలోఁ బ్రకటితములైనవి.

---

ఓన్నమః పరబ్రహ్మణే.

# ఆంధ్రవాగ్దేవి

శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి.

సీ. శ్రీరాజరాజనరేంద్రమందిరమున
నఖిలాంగసౌష్ఠవం బలరఁ జెలఁగి
మన్మసిద్ధిమహీశమణిసౌధములయందు
భాగ్యభోగ్యంబులఁ బరిఢవిల్లి
దక్షిణాధీశముత్యాలమండపమునఁ
గనకాభిషేకయోగంబు గాంచి
శ్రీకృష్ణరాయలసిరిఁ గూడి పల్లకీ
లేనుంగు లెక్కి యూరేఁగి మెఱసి
గీ. పేర్మి నంద్యాలకృష్ణభూవిభునినగర
ధగధగాయితనూతనశారహార
మఱుత ధరియించి విబుధలోకార్చలందు
నాంధ్రవాగ్దేవిమైశ్వర్య మభినుతింతు.

సహృదయులారా! సభాసదులారా!

ఆంధ్రసాహిత్యపరిషద్వార్షికోత్సవము నిమిత్తముగా సమావేశ మైన యీమహాసభలో ఆంధ్ర భాషాస్వరూప స్వభావములనుగూర్చి యొకింత ముచ్చటింపఁ బూనినాఁడను. సభ్యులు సావధానముగా మాతృభాష నొకింతసేపు మనసార నారాధింతురుగాక.

తెలుఁగు లేక, ఆంధ్ర మనెడి మనభాషయొక్క ప్రప్రథమ చరిత్ర మిక్కిలి దురవగాహము. దానినిగూర్చి యెందఱో యెన్నివిధములుగానో వ్రాసియున్నారు. నేనును నాలుగైదు విపులవ్యాసములు ప్రకటించియున్నాను. ఇపు డావిచారణ కవకాశము లేదు. కావున సంగ్రహముగా దానిస్వరూప మవలోకింతము.

ఆర్యులు రాక పూర్వము తెలుఁగునాట ననాదిగా నున్న పాఁతకాపులవాడుకలోని మాటలును, ఆర్యులు వచ్చినతరువాత నందు ప్రవేశించిన సంస్కృతప్రాకృత శబ్దములును, కలిసి 'ఆంధ్ర' మను పేర మన భాష యేర్పడినది. అది నన్నయభట్టారకునికి సుమారు వేయేండ్ల పూర్వఁపుమాట. అయిన నేమి ? నాఁటి తెలుఁ గిట్లుండునని యూహించవలసినదే కాని దానికి నిదర్శనమేమియుఁ గనరాదు. కనఁబడినంతలో నాఁటివర్ణక్రమాదికము కొంచెము తెలుపుట కెనిమిదవశతాబ్ది కీవలఁ బుట్టినకొన్ని శాసనములు తోడ్పడుచున్నవి గాని, అవి మనయుద్దిష్టార్థమును విశదీకరింపఁజాలవు. అందుచే నన్నయార్యునివాణియే మన కిందు శరణము.

భాష యొకరిసొమ్ము కాదు. 'భాష వ్యక్తాయాం వాచి' అను ధాత్వర్థమునుబట్టి లోకులచే నుచ్చరింపఁబడు స్పష్టోచ్చారణము గల శబ్దజాలము భాష యని విదిత మగుచున్నది గదా! అట్లే, ఆంధ్రులందఱు నొకజాతివారు కారు, ఒకచోటివారు కారు. పైనుండి వచ్చిన చతుర్వర్ణములవారు కొందఱు, ఇం దున్నవివిధవర్ణములవారుకొందఱు. నన్నయార్యునినాఁటికి గ్రంథరచనకుఁ దగినంతగా వర్థిల్లిన తెలుఁగు మాత్రము స్వల్పమా ? కాదు. "భాషేయ మమితా, దేశ్యా తత్ర చిత్రస్వభావయుక్" అని యథర్వణాచార్యు లన్నారు.

నన్నయార్యునికిఁ బూర్వము తెలుఁగునఁ గవిత్వ ముదయింపక పోలేదు. కాని, అది గణనీయమును హృద్యమును గాదు. దానంజేసి తెలుఁగున కాద్యగ్రంథము నన్నయభారతమే యనవలసివచ్చినది. అయితే, ఆనాఁడు దేశమున వాడుకలో నున్నశబ్దజాలము నట్లే నన్నయార్యుఁడు భారతమున వాడియుండె నని తలఁపరాదు. నాఁటిశబ్దజాలమును వినుటకుఁ జదువుటకు నింపగువిధమునఁ జక్కఁజేసి భారతమునఁ బ్రయోగించెను. అందుకే యతఁడు విపులశబ్దశాసనుఁడయ్యెను. అది

నేటికవిపండితుల బిరుదులవంటిది గాదు. యథార్థాక్షరము. ఆశబ్ద శాసనుఁడే వాగనుశాసనుఁడు, అతఁడే నన్నయార్యుఁ డతఁడే, ఆంధ్ర శబ్దచింతామణి రచించినవాఁ డనుచు నొకప్రవాదము, బాలసరస్వతి అప్పకవులనాఁడు బయలువెడలి లోకమున వ్యాపించినది గాని, అది యెంతమాత్రము విశ్వసనీయము కాదు. "నన్నయ ఆంధ్రశబ్దచింతామణి ముందు నిర్మించి తరువాత భారత మాంధ్రీకరించె" నన్న నేఁటి పండితుఁ డొకఁడు కట్టుకథ యుపయోగించెను కాని, నన్నయార్యుఁ డాచింతామణి రచించలే దనుట కందలిసూత్రములే సాక్షులు.

ప్రజలవాడుకలో శబ్దము లేదో యొకించుక మార్పు చెందు చుండుట నైజము. అది యేదేశభాష కైనను దప్పదు సరిగదా, ఆమార్పు లొకతీరుననే యుండవు. దానంజేసి వాడుకభాషలోఁ గూడ భేదములు గోచరించుచుండు ననుట మన కందఱకును విదితమే. మఱియు నేభాష యైనను వ్యావహారికదశనుండి గ్రాంథికావస్థకు వచ్చు నపుడు 'తొలుఁదొల్తఁ బద్యరూపమున బయలువెడలుట నైజము. దీనినే భాషకు ఛందోలక్షణస్థితి యందురు.

ఇట్లు భాషావిషయము బహుభంగులఁ జిత్తవిక్షేపము కలిగించు చుండ శబ్దజాలమునకు శాశ్వతత గలుగునట్లుగా భాషను జిక్కఁజేసి కొనుచు, ఆంధ్రదేశము చేసికొన్నపుణ్యమో యన నవతరించిన యామహానుభావుఁడు నన్నయార్యుఁడు భారతరచనారంభమునఁ బడిన క్లేశమెట్టిదో యూహింప నలవికాదు. అది వేయికృత్యాద్యవస్థలపెట్టు. అతఁ డుపయోగించిన పరమపావన మైనయాంధ్రమున కతన్ప్రతిష్ఠయే లక్షణము. తరువాత నన్నెచోడతిక్కనాది కవీంద్రుల కతనిపర్యాప్తయి లక్షణము లక్ష్యమునై దారి చూపినది. తిక్కనార్యునిశిష్యుఁ డగు కేతన్న మొదటియాంధ్రవ్యాకరణకర్త. ఆంధ్రభాషాభూషణమనెడి యాచిన్నగ్రంథము తెలుఁగుబహిరాకార మదిగో యని చూపించినది.

అంతే; పిదప నథర్వణుఁడు సంస్కృతమున నాంధ్రలక్షణము నిర్మించెను. గాని యది మృగ్యమైనది. దానితరువాత జన్మ మెత్తినది, ఆంధ్రశబ్ద చింతామణి—

సభ్యులారా! ప్రపంచమందలి ప్రతిపదార్థమును మార్పు చెందుచుండు ననుట సత్యము. అట్టియెడ భాషలకు మార్పు కలుగుచున్న దనుట కాశ్చర్య మేమి? భరతఖండమందలి యార్యభాషల కెల్ల తల్లి సంస్కృత మనుట నిరాక్షేపము. మన తెలుఁగు సంస్కృతభాషకు సాక్షాత్పుత్రిక కాకపోయినను, కన్నకూతుండ్రికంటె నామె కెక్కువ ప్రియురాలయ్యె ననుట సత్యము. భరతఖండమందలి యయ్యాప్రదేశములఁ బ్రజలవాడుకలో మార్పుచెందుచు వచ్చిసంస్కృతము తుద కాఱురూపములు దాల్చినది. వంగ మగధ గూర్జర మహారాష్ట్రాది దేశములందిపుడు వాడుకలో నున్నభాషలన్నియుఁ బ్రాకృతములు; సంస్కృతజన్యములు. మన తెనుఁగాంధ్రు లిచ్చటి వచ్చి స్థిరపడినపుడు వారు సంభాషించుకొను సంస్కృతప్రాకృతములతో మైత్రిచేసి పుష్టి గాంచిన మాట యథార్థమే కాని, కొంతకాలమునకుఁ దన్మయత్వము చెంది తన్నుఁ దా మఱచిన స్థితికి వచ్చినది. అయిననేమి? సహజము లైన మార్దవమాధుర్యముల కనుగుణముగా సంస్కృతప్రాకృతశబ్దజాలమును స్వాయత్తముఁ గావించుకొన్నది. దానంజేసి 'దేశభాషలందుఁ దెలుఁగు లెస్స' యనిపించుకొన్నది — బెజవాడశాసనమునాఁటికి తెలుఁగు, తత్సమతద్భవశబ్దముల కలయికచే గ్రంథరచనస్థితికి వచ్చియున్నదని తెలియుచున్నను, అది సకలసుకవిజనవినుతునకై యెదురుచూచుచు నట్టె నిలిచిపోయినది, ఆనాఁటికి తెనుఁగు దేశ్యము వ్యవహారదక్షమై యున్నట్లు భావింపక తప్పదు గాని, యిపుడు పరీక్షించినచో దేశ్యప్రవాహిని కొంత యంతర్వాహిని యైన దనితోఁచకపోదు. ఇందుకు, భారతాదులందుఁ గనవచ్చు దేశ్యశబ్దములు కొన్ని యిపుడు దేశమున

వాడుకలో లేకపోవుటయే యొకనిదర్శనము. దీని కంతకును గారణము తత్సమశబ్దజాలము వాడుకలో నెక్కువగా వ్యాపించుచువచ్చుటయే.

వాడుకలోఁ గొన్నికొన్ని శబ్దములకు రూపాంతరము లేర్పడుచుండు ననుట సర్వభాషాసాధారణము. నన్నయాది మహాకవు లట్టి రూపాంతరములను గూడఁ బ్రయోగించి వానిప్రయోగార్హతను బ్రకటించియున్నారు. ఇందుకుఁ గొన్ని కావలెను. ఒకళ్లు-చెప్పుము. చూ-సూఁతుండ్రు-చేతురు-వెళ్ళిరి- అల్లుండ్రు. వీనిని, ఇట్టివానిని దరువాతి కవు లందఱు ప్రయోగించియున్నారు, ఇట్టివానికి బాలవ్యాకరణ మనుశాసనముచేయలే దని యిట్టి వన్నియు గ్రామ్యము లనఁదగునా? నన్నయాదికవీంద్రు లెక్కడ? చిన్నయసూరి యెక్కడ? ప్రయోగ దృష్టి యున్నవై యాకరణుఁ డెవఁడైనఁ బైప్రయోగముల కనుశాసనము చేయక విడుచునా? అథర్వణునిలక్షణగ్రంథము మనకుఁ దక్కినది కాదు కాని, యతఁ డుదారశీలుఁడై భాషాస్వభావము చక్కఁగాఁ గనిపెట్టె ననక తప్పదు. ఇందు కందలిమాట యొకటి—

"ప్రతిక్రియ మజా న్తత్వం ప్రతీతం నతు గీయతే ।
క్వచి దింప్వా న్తతాం కేచి దూచిరే నహి మే రుచిః ॥"

చేయడము-చెప్పడము-త్రవ్వడము- వంటిఅడాంతములు ప్రసిద్ధములఁట. కాని, వానికి బ్రయోగములు లేవఁట. ఇట్లనుటచే, అడాంతములు ప్రయోజ్యము లనియే యతనిభావము. 'ఆరగింపు' వంటి ప్రయోగములు కనవచ్చును గాని, యవి తనకు రుచ్యములు గావఁట.

'ఎల్లయందు' వంటి తిక్కనాదులప్రయోగము లెఱుఁగక, 'ఎల్లఁ శిష్యులఁ గొంచు వత్తునో' వంటి శ్రీనాథులప్రయోగము లెఱుంగక- "సర్వపర్యాయం బైనయెల్లశబ్దము ద్రుతాంతం బైనయన్వయంబు-దాని కసమాసంబున విశేష్యంబునకు ముందు బ్రయోగంబు లేదు." అని శాసించిన బాలవ్యాకరణమూ మనమహాభాషలోని

గుణదోషములను నిర్ణయించునది? ఆహా! భాషాతత్త్వవేత్తలరచనలడుగంటిపోవుటయు, అరవతెలుఁగువారు గ్రంథప్రకాశకులును వ్యాకర్తలు నగుటయు మనభాషదుర్దశగదా!— 'బాలా దపి సుభాషిత' మ్మనునట్లు మంచి యెం దున్నను గ్రహింపఁదగును గాని చెడ్డ నెవరు గ్రహింతురు? నన్నయతిక్కనాదిమహాకవులరచనలే మనకు లక్షణములు లక్ష్యములునై యుండ నందలిశబ్దముల గుణదోషములను నేఁటి వ్యాకర్తలమాటలనుబట్టి నిర్ణయింపవచ్చునా? పోనిండు- అది పెద్దవిషయము. ఆవిచారణ కిది సమయముకాదు కాని, మీరగ్రాంథికభాషావాదుల కృతులలోనికొన్ని ప్రయోగములు చిత్తగించి, నేఁటియాంధ్ర మేస్థితికి వచ్చినదో పరిశీలింపుఁడు—ఆమె బ్రహ్మరాక్షసిని యయ్యెను, మీ రానతిచ్చిరి- మీరు దేశభాష నిటే పరిత్యజింపఁజేయఁబడిరా?- చేతులాఱ నోరాఱఁ దాము భాషాసేవ సేసితిరి గదా!— ఏది మీ చేయి నిటు తెండు- దానిపన్నులం గనఁబడుమాంసలేశము- రెండు వేవురుమందితోఁ బోరునకు నేఁ తేరుము-నే నూరునకుఁ బోయి వెనుదీకరావుటకుఁ జూతును—. ఇత్యాదులు నేఁటి గ్రాంథికకృతులలో వందలు కాదు వేలు, వేలకువేలు.

ఇట్టిభాషయా మన కిపుడు వాంఛనీయము? ఈప్రయోగములకు సాధుత్వముసాధించి వీనియర్థము విశదీకరించువిద్వత్తల్లజుఁ డిఁక ముందు పుట్టవలెను గాని పుట్టినవారిలో లేఁడు.

మిత్రులారా! ఇంకొకమాట చెప్పియీయుపన్యాసము ముగింతును. అవ్యవధిగా వ్రాయవలసివచ్చిన యీవ్యాసమందు ప్రసంగించవలసినపెక్కువిషయములు స్పృశించి విడిచితిని. క్షమింపుఁడు.

ఈ యాంధ్రసాహిత్యపరిషత్తు 1911 విరోధికృత్సంవత్సరమున నావిర్భవించినది. ఆనాఁటియాంగ్లవిద్యాధికులలో మాతృభాషయెడ నాదరము కలవారు తక్కువగా నుండెడివారు. అప్పటికిఁ దెలుఁగులోని

శృంగారప్రబంధములు కొన్నిటిని నిర్మూలము గావింపవలెనన్న యభియోగ మొకటి ప్రభుత్వమువారిదృష్టికి వచ్చియున్నది. దేశమున విద్యార్థికులలోఁ బెద్దసంచలనము పుట్టినది. ఆసమయమున శ్రీజయంతి రామయ్యపంతులుగారి యాంధ్రభాషాభిమానము ప్రబలకారణముగా శ్రీవేంకటగిరి, శ్రీపిఠాపురమహారాజుల మహౌదార్యమాధారముగా నీపరిషత్తు చెన్నపురిలో వెలసినది. వెంటనే శృంగారప్రబంధవిరోధము నణఁచినది. ఆనాఁటికే గ్రామ్యగ్రాంథికభాషావివాదము తలయెత్తి దేశము నలుఁగడల వ్యాపింపఁ జొచ్చినది. పాఠశాలలందు వ్యావహారికభాషకుఁ బ్రవేశము గలిగింపనుద్యమించినది. చిన్నయుత్తరువు పుట్టించినది. కాని, యీపరిషత్తాయుత్తరువును గూడ రద్దుగావింపఁ జేసినది. తరువాత గ్రాంథికవ్యావహారికభాషలతీరు లెట్లున్నవో సభ్యులెల్లరకు విదితమే. ఇపుడు భాషావివాదమునకు తావే లేదు. రచయితలందఱు మహామహోపాధ్యాయులే. ఇంకపరిషత్తు తొలుతనే సంకల్పముతో నుదయించినదో ఆసంకల్పము సూర్యరాయాంధ్రనిఘంటురూపముగా సిద్ధించినది. పరిషదుద్యమము సార్థకమైనది. పిఠాపురమహారాజువారికి యశస్సు దక్కినది. పరమేశ్వరానుగ్రహమునఁ బరిషత్తు వర్ధిల్లుఁగాక!

ఓం శాంతిః

శ్రీరస్తు.

# ఆంధ్రసాహిత్యపరిషత్తు 45 వ వార్షికోత్సవము

## పరిషదధ్యక్షుని ప్రవచనము—ఆంధ్రాస్థానకవి.

తే. ఆంధ్రసాహిత్యపరిషదాఖ్యాశ్రితమైన
దివ్యసంస్థ యియ్యది యాంధ్రదేశమును స
ముద్ధరించెడునట్టి దై యొప్పుఁగాక
సర్వేపల్లి రాధాకృష్ణసదయులదయ.

ఓ ! సభాస్తారులారా !

"ఆంధ్రసాహిత్యపరిషత్తు" అను నీసంస్థ సుమారు నలువదిఏడు సంవత్సరములకు మున్ను శ్రీశ్రీపీఠికాపురాధినాథులు శ్రీరాజారావు వేంకటకుమారమహీపతి సూర్యారావు బహద్దరువారి ధనసాహాయ్యమున శ్రీజయంతి రామయ్యపంతులుగారు లోనగువారి ప్రోత్సాహమున అపూర్వముగా నెలకొల్పఁబడినది. దేశమున నిట్టిసంస్థలు లేవా! దీని కపూర్వత్వమనుట యేమందురేమో? మహారాజులు మహావిద్వాంసులు సమర్థులు చేపట్టినారు గావున కొంత విశిష్టత దీనికిఁ గల్పింపవచ్చును.

శ్రీపిఠాపురముమహారాజావారు లక్షలకొలదిధనము విద్యాదిసంస్థలకు వితరణము చేయుచున్నారు. చేసియున్నారు. రామయ్యపంతులుగారు పట్టపరీక్షలం గృతార్థులై గవర్నమెంటులో గొప్ప యుద్యోగములు చేసి ఉపకారవేతనము స్వీకరించుచున్నారు. సంస్కృతాంధ్రపండితులు, కవులు, గ్రంథకర్తలు, సంపన్నులు. అట్టివారు నెలకొల్పినదగుటచే నిది యుత్తమోత్తమసంస్థ యనుట సత్యదూరము కాదు. అప్పుడు పిఠాపురసంస్థానమున దివానుగా నున్న శ్రీమొక్కపాటి సుబ్బారాయఁడుగారు తౌర్యమునందే కాక సంస్కృతాంధ్రము

లందును బండితులగుటచే నిట్టియుత్తమకార్యముల మహారాజావారికి దోడ్పడి సహకారులై ప్రవర్తిల్లఁజేయుచుండువారు.

ఆంధ్రసాహిత్యపరిషత్తనఁగా సామాన్యపుస్తకభాండాగారముల వంటి దనుకొనుచుందురేమో? అట్లుగాదు. "పరితఃసీదంత్యత్రపరిషద్" దీనియం దంతటను పండితులు నిండియుందురు. అని వ్యుత్పత్త్యర్థము. అనఁగా దీనియందుఁ బ్రతిదినమును మహాపండితులు సమావేశమై యనేకధర్మము లుపదేశించుచుందు రని పరమార్థము. పుస్తకభాండాగారములలో చదువుకొనుటకు పుస్తకములు మాత్ర ముండును. తెలిసినను తెలియకున్నను జదువుకొనవచ్చును. ఇదిఅట్టిది కాదు. మహాపండితులిందుండి ప్రజలకు ప్రత్యహమును బోధింతురు.

ఇట్లు మహోత్తమవిఖ్యాతిం గాంచు నీపరిషత్తును నిర్మించినకాలములోనే తెలుఁగునకు సంపూర్ణనిఘంటువు లేనికారణమునంజేసి అట్టి మహానిఘంటు వొకటినిర్మింప నెంచి మహారాజావారు లోకమునంగల పండితుల నాహ్వానించి వారికిం దగునట్లుమాసవేతనము లిచ్చి "సూర్యరాయనిఘంటు" వనుపేర నిఘంటు వొండు నిర్మింపనారంభించినారు. ఆనిఘంటునిర్మాణమున కిప్పటికే మహారాజావారికి 10, 12 లక్షలకు సుమారుగానే వ్యయమైయున్నది. ఇప్పటికిని కొంచెము మించుమించుగా గ్రంథముపూర్తియైన దని చెప్పవచ్చును. ఆనిఘంటు వాంధ్రలోకమునకు బరమోపకారక మని ముమ్మాటికిఁ జెప్పవచ్చును. పరిషత్కార్యాలయము, నిఘంటుకార్యాలయమును కొంతకాలము పిఠాపురములో,కొంతకాలము మదరాసులో,కొంతకాలము కాకినాడలో నిలువబడినవి. ప్రస్తుతము పరిషత్కార్యాలయము సూర్యారావుపేటలోని యీస్వభవనమున నిట్లు విరాజిల్లుచున్నవి. మహారాజావారు లక్షలు వ్యయముచేసి నిర్మించిన సూర్యారాయనిఘంటువుయొక్క స్వత్వమంతయు మనపరిషత్తునకే యిచ్చివేసినారు. ఇదిగాక కొన్నివేల

రూప్యములు పరిషత్తుపేర బ్యాంకిలో నుంచి దానివడ్డీ తీసికొనుచు కావలసిన కార్యములకు వ్యయముచేయనగునట్లు చేసియున్నారు.

మఱియును మహారాజావారు అనేకదానధర్మములు చేసినారు. రాజమహేంద్రవరములో వీరేశలింగంహైస్కూలునకు సుమారు రెండు లక్షలరూప్యము లొసంగినారు. కాకినాడలో 10, 12 లక్షలవెలగల పెద్ద నివేశనస్థలము అందులోనిబిల్డింగులతో నున్న తమపూర్వులచే ప్రతిష్ఠింపఁబడి తమచే పోషింపఁబడుచున్న పి. ఆర్. కాలేజీకి దానము చేసినారు. ఇట్లులక్షలుఖరీదుచేయు పెద్దపెద్దనివేశనస్థలము .లెందఱకో యిచ్చినారు. అనేకభూదానములు, గృహదానములు, విద్యాదానము చేసినారు. అనేకులకు వివాహములు ఉపనయనములు చేయించినారు. కాకినాడ పిఠాపురములలో అనాథశరణాలయములు కట్టించి దిక్కుమాలినప్రజలనెందఱనో పోషించినారు. వారు బ్రహ్మసామాజికులయినను వేదశాస్త్రసంపన్నులగు పెక్కుమంది ఆర్షమతిసంపన్నుల మాసాశనము లిచ్చి పోషించినారు. తమ సంస్థానములో జగత్ప్రసిద్ధపండితులను, కవులను, గాయకులను వేలకొలఁదిధన మిచ్చి నిలుపుకొనినారు. ఇదిగాక వేదశాస్త్రకవిత్వపరీక్షలు గావించి ప్రతిసంవత్సరము ఉత్తీర్ణు లగువారికి నూర్లకొలఁది బహుమానము లిచ్చినారు. లోకములో దాత లెవ్వరని చెప్పవలసివచ్చినప్పుడు శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతిసూర్యా రావుబహద్దరు మహాశయులనియే చెప్పవలయును.

సీ. కర్ణు నెఱుంగమా! కవచ మిమ్మనినంత
నింద్రుశక్తిం గొని యిచ్చె దాని
అదధీచి నెఱుంగమా! వేల్పులంతవార
దేహ మిమ్మనినంత దెసలుచూచె

శిబి నెఱుంగమొ తన్నుఁ జేరిన పిట్టకై
యీలేక యిచ్చె మై మెఱచి తూచి
బలి నెఱుంగమె మూఁడుపదములు తల నిత్తు
నని యీయలేక లేదనఁగ నుండె
తే. ఇట్లు పేరొందినట్టి రే యిట్టులైరి
రావురాచకొలంపుమేల్ రత్న మితఁడు
లే దనెడుమాట లేక యే దేది యైన
నడుగకుండినఁ దెలిసి తా నది యొసంగు.
సీ. పుడమిపైఁ బొడమిన పుడుకుమానిక మన
నడుగలే దన కిచ్చునట్టివాఁడు
తనపజ్జ నూర్లు వేలు నొసంగి చదువరు
లను బెక్కురను నిల్పుకొనినమేటి
తెలుఁగుబాసం జేటతెల్లం బొనర్పక
బ్బము సేయ వేలిడు పబువుమిన్న
ననదలౌ వారల నక్కటికంబున
నరసి కాపాడెడు నట్టిఱేఁడు
తే. విద్దెలకుఁగాను వేనవే ల్వెచ్చపెట్టి
పెట్టుచెట్టనఁ బేరందినట్టి దిట్ట
కడిఁదిమోమోట గలిగినయెడఁద వాఁడు
రావుకులమానికము సూర్యరాయఁ డెన్న.

ఇట్టిమహాప్రతిష్ఠం గాంచినమహారాజు మన యీ పరిషత్తును బుట్టించి పెంచి ప్రాణము గల్పించి కాకినాడపురంబున నుండునట్లు చెప్పి తాను మదరాసుకో నివాస మేర్పఱచుకొని సంస్థానవ్యవహారముల న్నియు దివానులమూలమున నడుపుకొనుచుండె. అంతలోఁ బరిషత్తును తనపుత్రికగాఁ జూచుకొనుచుండు శ్రీజయంతి రామయ్యపంతులుగారు

స్వర్గస్థులయిరి. కాన నిర్వాహకవర్గమువారు కొందఱు పరిషత్కార్యములు నిర్వహించువారైరి. ఆలో మహారాజావారు నన్నీపరిషదధ్యక్షపదము స్వీకరింపవలయు నని యాదేశించుటచేతను మొదటినుండియు నా కీపరిషత్తు రాజకీయములకు పార్లమెంటువలె భాషావిషయమున నిది పార్లమెంటుగా నుండవలయు నని కోరికకలవాఁడ నగుటంచేసి, అసమర్థుఁడ నైనను గ్రామాంతరమం దుండువాఁడ నైనను కాదన కంగీకరించి తలయూచితిని. నేను మీటింగులకు రాకపోయినను అప్పటికార్యదర్శులగు ప్రతివాది భయంకర పార్థసారథి బి. ఏ. బి. యల్. గారును, శ్రీచతుర్వేదుల సత్యనారాయణశాస్త్రి యం.ఏ. గారును నా రానిలోపము కానరాకుండునట్లు పరిషత్తును చక్కఁగా నడిపించినారు. నేనీపరిషత్తులోఁ జేరినపిదప రాజమహేంద్రవరములో నొకవార్షికోత్సవమును జరిగినది.

ఆకాలమునఁ గార్యదర్శి పార్థసారథిగారు పరిషత్తును తనకన్నపిల్లవలె నెంచుచు కొంతమందిధనికుల నాశ్రయించి కొన్నిమంచికార్యములు చేయించియున్నారు. జయంతి రామయ్యపంతులుగారితోబుట్టుచే మన పరిషత్తునకు శాశ్వతగృహదానము చేయించినారు. అదియే యిది. మఱియుఁ గొందఱచే మఱికొన్నిదానములు చేయించినారు. ఈలో సూర్యరాయనిఘంటువు మాట, మాకు మహారాజుగారు వ్రాతమూలముగా నిచ్చినారు. మొదలగుసంగతులతో ఎన్నో చిక్కులు తటస్థించినవి. అవియన్నియును మనపార్థసారథిగారు మదరాసు లోనగుచోటులకు వెళ్ళి మాటలాడవలసినవారితో మాటలాడి చేయవలసినకార్యములు చేసి పైనుదాహరించినచిక్కు లేవియు లేకుండఁ జేసినారు. మఱియు మన గవర్నమెంటువారికి మనపరిషత్తువిషయమై తెలిపి వారివలన కొన్నివేలరూప్యములు సంపాదించినారు. ఇట్లున్నప్పుడు చతుర్వేదుల సత్యనారాయణశాస్త్రిగారు కాకినాడ విడిచి స్వగ్రామమునకుఁ బోవువారై తమకార్యదర్శిత్వమునకు రాజీనామా యిచ్చియున్నారు. అంతలో దైవ

ప్రతికూలతంజేసి ప్రధానకార్యదర్శి పార్థసారథిగారు అకాలమరణముం బొందినారు. అప్పుడు మేనేజరుగా నుండునాచార్యులుగారు తమయుద్యోగమునకు రాజీనామా పెట్టినారు.

ఈసంగతు లన్నియు నాకుఁ దెలిసి నేను హుటాహుటిని కాకినాడకుంజని మిత్రరత్నములం గలిసికొని పరిషత్తుంగూర్చివిచారించుచు, ఇపుడు మునుమున్న చేయదగినది సమర్థుఁడయిన కార్యదర్శిని నిర్ణయించుకొనుట యని, నామనస్సుం బంపి కాకినాడనంతయుం గాలించినాఁడ. అపుడు శ్రీదంటు భాస్కరరావుగారు లక్షలకొలందిగా నడుచు నౌకావ్యాపారములో పాల్గొనియున్నవారు ధనవంతులు విద్యావంతులు కాకినాడపురపాలకసంఘాధ్యక్షులు సుహృదయులు. నేను వారియింటికివెళ్ళి పరిషత్తుకార్యదర్శివిషయమై మనవిచేయగా మాఱుమాటాడక నేను తప్పక మీచెప్పినచొప్పున కార్యదర్శిత్వము వహింతునని చెప్పినారు. నాఁడే సభాక్రమము నడిపించి వారిని కార్యదర్శిగా నెన్నుకొంటిమి అది మొదలుకొని వారు తదేకదీక్షగా సర్వపరిషత్కార్యములను చక్కగా నడిపించుచు మునుమున్న వార్షికోత్సవము చేయుట కిట్లుఏర్పాటు చేసినారు. దీని నిర్వహించుటకు ధనవిషయము విచారింపలేదు. ఆభారము తామే మోయవలయు నని యేమో? ఈ వార్షికసభ తొల్లింటివలెం గాక యిద్దఱుపండితులకు సత్కారములు చేయ నిశ్చయమైనది. అన్నిటికన్న మహోత్కృష్టకార్యము శ్రీ శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణపండితుల నాహ్వానించి వారిచే నిఘంటు 5, 6 సంపుటములు ఆవిష్కరింపఁజేయుటయే.

ఇఁకపై నీపరిషత్తు నడపనగు విధుల నించుక సూచించి ప్రస్తుతమునకు వచ్చుచున్నాను. ఇందు భాషావిషయము లన్నియు నిర్ణయించి ప్రభుత్వమువారికిఁ దెలుపవలసియుండును. గావున మనదేశమునం గల సంస్కృతాంధ్రపండితుల 20 మందికి తక్కువకానియట్లుండ

వారిని కోరి ఆనరరీసభ్యులుగా నియమించుకొనుట 2. అందఱకు నాయకమణిగా శ్రీసర్వేపల్లి రాధాకృష్ణులను సర్వోపద్రష్టలుగా నుండ ప్రార్థించినిలుపుకొనుట 3. మనపరిషత్తులో మఱికొంతమందిసభ్యులుగా చేరునట్లు చేయుటయేకాక, కార్యనిర్వాహకవర్గము తక్కువగానున్నది 19 మందికి తక్కువకానట్లు చేయుట. 4. ఇంతగొప్పసంస్థలో మేనేజరుగా నొకసమర్థుఁడుండితీరవలెను. అట్టి సమర్థుని నియమించుకొనుట. 5. మన పరిషత్తుతాలూకు నిఘంటువు లోనగుపుస్తకములు దేశమున తిరిగి అమ్మించుటకు తగినవారి నేర్పాటుచేయుట. 6. పరిషత్కార్యనిర్వహణమునకు సాలు 1కి సుమారు 5, 6 వేల రూప్యములు వ్యయమగుచున్నది గావున మనపరిషత్తువిషయమై మనవిచేసి గవర్నమెంటువారివలన ప్రతిసంవత్సరము చాలినంతధనము సంపాదించుట. ఇత్యాదులు మఱికొన్ని కలవు. ఇవి యన్నియు మనకురాధాకృష్ణులయనుగ్రహ మున్నచోసఫలములు కాగలవు. శ్రీరాధాకృష్ణులు రాధాకృష్ణులే చిత్తగింపుఁడు.

వీరు నెల్లూరుమండలమందలి సర్వేపల్లి యను పల్లియందుబుట్టినవారు. ఆర్వేలనియోగిబ్రాహ్మణులు. వీరు శంకరాచార్యులవలెవిద్యాభ్యాసము చేసి పట్టపరీక్షలఁ గృతార్థులై మునుమున్న రాజమహేంద్రవరమున ఆర్ట్సుకాలేజీయందు లెక్చరరుగా నుండి పిదప విజయనగరంబునందును మఱికొన్నిస్థలములందు నుండి వెనుక వాల్తేరున ఆంధ్రవిశ్వవిద్యాలయమున వైస్‌ఛాన్సెలరై తరువాత బనారస్‌యూనివర్సిటీలో వైస్‌ఛాన్సెలరై సంవత్సరమునకు 2,3 మాసములు ఇంగ్లాండుకాలేజీలో ఫిలాసఫీ యుపన్యాసకులుగా పనిచేయుచు సర్వదేశసంచారము చేసి వాసి గాంచినారు. వీరు భారతదేశప్రతినిధిగా జర్మనీలో కొంతకాలము నున్నారు. వీరిని విదేశములలో ఎఱుగనివారు గౌరవింపనివారును లేరు.

ప్రస్తుతము వీరు మనభారతదేశమునకు వైస్‌ప్రసిడెంటుగా నుండి మనలను బాలించుచున్నారు. ఓటింగుపద్ధతితో వ్యవహరించు నిక్కా

లములో మనరాధాకృష్ణులను మొదటిసారియు, రెండవసారియు ఎలక్షను లేకయే యేకగ్రీవముగా వైసుప్రెసిడెంటుగా నెన్నుకొనినారు. దీని వలన వీరికి దేశమం దెంతగౌరవాభిమానము లున్నవో తెలియబడు చున్నది. ఈమహాపురుషునకు నేను ఒకలక్షమందికి తక్కువకాని అలంపురం మహాసభలో నారచించిప్రత్యేకముగా ముద్రించిన భగవద్గీతా శాస్త్రము కృతియిచ్చియున్నాను. నాజన్మము సార్థకమైనదని తలంచినాను.

అట్టి యీ రాధాకృష్ణులకు స్వాగతము పలికి కార్యక్రమంబునకుం బూనుకొనం గోరుచున్నాను.—

శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణులకు సమర్పించిన

స్వా గ త ప త్ర ము.

శ్లో॥ సర్వేపల్లికులసింధు సుధాంశో!
భోజరాజసమశాస్త్రవిచార!
"స"ర్మహాబిరుదసంచితకీర్తే!
స్వాగతం భవతు తే శుభమూర్తే!

శ్లో॥ శ్రీసర్వేపలివంశదుగ్ధజలధే రాకాహిమాంశో! మహా
దేవానుగ్రహసంగృహీతవిభవప్రోల్లాస! విద్వన్మణే!
బ్రహ్మానందరసైకమగ్నహృదయ! త్వాంప్రార్థయా మ్యద్యభో
రాధాకృష్ణ! కృపారసేన పరిషల్లక్ష్మీ మిమాం పాలయ.

శ్లో॥ అహో! రాధాకృష్ణ! ప్రభవసి మహీనిర్జరకులే.
యథా రాధాకృష్ణో యదువరకులే ద్వాపరయుగే।
కలా వార్వేలాంధ్రప్రథితవిబుధానాం గుణమణి
స్తథా త్వం దేవానాం పతి రసి మహాభారతవర!

శ్లో॥ ఎలక్షన్నామాంచ త్వరిగణన మస్త్రీహ కృతినాం
యశస్స్ఫీతానా మప్యధిపతిజనానాం తవ తు భోః
సమాహలా యేదం భారతవర ప్రసీడెంట్వాధిపదం
ప్రదత్తం ద్వైవారం సరుబిరుదవిఖ్యాతవిభవ!

శ్లో॥ బనారస్కాలేజీప్రిన్సిపలునా మోత్తమపదం
సమారుహ్యాహింగ్లాండ్వరవిమయవిద్యాలయతలే
నువేదాంతో శ్శాస్త్రప్రవచననియుక్తోన్యరమహో
మహారాజశ్రీమన్ ! ద్విజకులసముద్భూతవిభవ!

శ్లో॥ శ్రుతం దృష్టం యావద్భువనతలసంచారసమయే
యథా త్వాం దేశీయై రుపచితవదో ऽసి ప్రభువర!
ప్రభూత స్త్వం కీర్త్యో లలితపరమాంశాంచితజను
స్స్వాకీయాం స్తాతుం భూతలగతజనా న్నికృష్టచరితాః

శ్లో॥ మహారాజేన శ్రీపిఠపురవరాస్థానవిభునా
ప్రతిష్ఠాప్యాత్రేయం పరిషదతివిఖ్యాతి మగమత్।
అభిఖ్యాం చేదానీ మపి కలితుమే వేచ్ఛతి విభో!
కృపాం రాధాకృష్ణప్రభువర! కురూద్యత్పరిషదమ్

శ్రు॥ సహ నా వవతు సహ నౌ భునక్తు
సహ వీర్యం కరవావహై
తేజస్వినా వధీత మస్తు
మా విద్విషావహై.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

---

# అవశ్యాభ్యసనీయా దేవభాషా



శ్రీ ద్విభాషి సోమనాథశాస్త్రీ

అయి భోః విద్వత్కవిమహోదయాః !

సువిదిత మే వాస్య లోకస్య సకలకలాభివృద్ధిహేతు, ర్జగత్కల్యాణసంవిధానసంధాయకో, నిఖిలయశశ్శ్రీసముల్లాసనమున్మేష హేతుభూతో ధర్మ ఇతి. ఏవంవిధస్య ధర్మస్యపరిచోదనసాధుసాధనం సుస్వర సంపత్తిమయం వేదచతుష్టయ మి త్యేతద్విషయ శ్చ పరివ్యక్తతర ఏవ హి. అత ఏవోక్తం విదర్భరాజకృతౌ చంపూరామాయణే

"ఉచ్చైర్గతి ర్జగతి సిధ్యతి ధర్మత శ్చేత్
తస్య ప్రమా చ వచనైః కృతకేతరై శ్చ" దితి.

ఏతద్వేదచతుష్టయం సురతరంగిణీనవసౌగంధికగంధబంధురపావనపయఃపరివాహహారిణ్యాం దేవభాషాయా మేవ నిబద్ధ మాసీత్. ప్రభుసమ్మితా వేదా, స్సుహృత్సమ్మితాని పురాణాని, కాంతాసమ్మితాని కావ్యాని చ. కిం బహు నోక్తేన జ్యోతి స్తర్కవైద్యవేదాంతాది జగదున్నతిహేతూని యాని యాని శాస్త్రాణిసంగీతాదయో యా యాః కలా, నైతికపథోపదర్శనః పురాణేతిహాసా శ్చ యే యే సముల్లసంతి తే సర్వే గ్రంథా అపి దేవభాషాయా మేవ సబద్ధా స్సంతతం సతాం ప్రతిభాశస్త్రాణాం రత్నశాణా ఇవ. సర్వ దైతద్భాషామాహాత్మీ ప్రభుత్వావలంబేన వినా న ప్రవర్ధతే ఖలు హసత్కుసుమవల్లికా పురా విక్రమస్యాస్థానే నవరత్నానీతి విశ్రుతాః కాలిదాసాదయో.—

"పురా కవీనాం గణనాప్రసంగే
కనిష్ఠికాధిష్ఠితకాళిదాసా
అద్యాపి తత్తుల్యకవే రభావా
దనామికా సార్థవతీ బభూవ"

"అమరమునినా శబ్దఖనినా" ఇత్యాదివాక్యానాం లక్ష్మీభూతా స్సంతః ఖండాంతరే ష్వపి స్వయశసాఽభివ్యాప్తా భవన్. భోజరాజస్య కాలేఽపి మాఘాదయో మహాకవయః కవితారసదోహదేన భాషా లతాం కోరకితా మకుర్వన్. కింతు దేశీయనాగరికతాయా భాషాయా శ్చ స్త్వవినాభావసంబంధః అత ఏ వాంగ్లేయా అస్మద్దేశే ప్రథమతః పదం నిక్షిప్య స్వభాషాప్రచోదనరూపేణ స్వీయాం నాగరికతా మస్మ ద్దేశే సుదృఢ మభివ్యాప్తా మకుర్వన్. తస్మా దేతదున్మూలనాయాస్మత్ నాగరికతాభివృద్ధయే చ భారతదేశప్రభవానామ్ సర్వేషాం హైందవా నాం సంస్కృతభాషాభ్యసన మవశ్యకర్తవ్యమ్. ఏతదభ్యాసోఽపినాతిక ఠిన ఇతరాభ్యో భాషాభ్యః. కించ సమస్తాసు పాఠశాలా స్వాబాల్యం బాలానామ్ కళాశాలావిద్యాపరిసమాప్తిపర్యంతం యథా అవశ్యపఠ నీయభాషా తత స్తథా కర్తవ్యా అస్మత్పాలకవర్గై రితి, విశేషతోఽ స్మదుపరాష్ట్రపతే శ్రీమత స్సర్వేపల్లి రాధాకృష్ణమహాశయస్య సంస్కృ తోపగుంఫితేషు వేదాంతాదిశాస్త్రేషు సునిసితా పాండితీ విద్యోతత ఇతి సువిఖ్యాతిత్వా ద్దేవమహాశయో ఽస్య సంస్కృతస్య సర్వదా హస్తా వలంబం దాస్యతీతి స్యై, తద్విధానాయ సర్వదా వాగ్దేవీ ప్రకటాత్ విక్షేపై రనుగృహ్ణా దితి చ, సానంద మహ మభ్యర్థ యితో పరమే.

శ్లో॥ దిగంతసంక్రాంతభావసౌరభా ।
నవప్రపత్కావ్యరసస్ఫురద్రసా
మృదూక్తిసంపత్తికలై ర్వికాసితా
సుజాతితుల్యా సురవాగ్వివర్ధతామ్.

# భారత భారతి:

## నన్నపార్యుని నాటకీయత

“స్ఫూర్తిశ్రీ”

“ప్రాంశు పయోద నీల తను భాసితు నుజ్జ్వలదండధారుఁ బిం
గాంశు జటచ్ఛటా భరణు నాగమపుంజ పదార్థ తత్త్వవి
ద్వంశయు కారుఁ గృష్ణమృగచర్మకృతాంబరకృత్యు భారతీ
వంశ వివర్ధనున్ ద్రిదశవందితు సాత్యవతేయుఁ గొల్చెదన్.”

మహాభారతమున సభాపర్వము రమ్యమై పండితచేతో నిర్వృతి చేయుచున్నది. అందు మరలఁ దొమ్మిది పర్వములు గలవు. సభాపర్వము, మంత్రపర్వము, జరాసంధవధ, దిగ్విజయము, రాజసూయము, అర్ఘ్యాభిహరణము, శిశుపాలవధ, ద్యూతము, అనుద్యూతము.

శ్రీమదాంధ్రమహాభారతమున రాజసూయము వరకుఁ బ్రథమాశ్వాసమున వర్ణితమైనది. అర్ఘ్యాభిహరణమునుండి అనుద్యూతము వరకు ద్వితీయాశ్వాసమున వర్ణితమైనది. ఈ రెండాశ్వాసములును రెండు ప్రత్యేక కావ్యములుగాఁ బరిగణింపఁ దగినంతటివి. మొదటి యాశ్వాసము మయుఁడు సభను నిర్మించి ధర్మజున కిచ్చుటతోఁ బ్రారంభమై, క్రమపరిణామము నొంది, తత్సభయందు ధర్మజుఁడు రాజసూయ యాగదీక్షితుఁడగుటతో ముగియును. రాజసూయము చేయవలయు నన్న సామాన్యులకు సాధ్యముకాదు. సర్వసర్వంసహామండలమును శాసించి, పాలింపఁ గల సార్వభౌములు మాత్రమే దానికి సమర్థులు. అందువలన ధర్మజుఁడు బంధుమిత్రాదులతో బాగుగా నాలోచించి, కృష్ణుని ప్రోత్సాహము వలన రాజసూయమున కంగీకరించును. జరాసంధుని వధ వలనఁ, బాండవుల దిగ్విజయము వలన ధర్మజుఁడు రాజ

సూయదీక్షాదక్షుఁడగును. మయుఁడు నిర్మించి యిచ్చినదే రాజసూయ మునకు రంగస్థలము.

ఇఁక ద్వితీయాశ్వాసమునఁ గథకొంచెము వేగమునందుకొనును. అర్ఘ్యమున కర్హునిగా శ్రీకృష్ణునెన్నుకొని పూజించుటతో నారంభమై, క్రమవికాసమునొంద, అనుద్ఘాతముతో నంతమగును. అర్ఘాభిహరణము, శిశుపాలవధ- ఈ రెండును గలిసి యొక యేకాంకిక వలె నాటకీయమైన చక్కని చలనము (Dramatic movement) కలిగియుండును. దీనికిఁ బరిణామ స్వరూపముగానే ద్యూతానుద్యూతములు సాగి అరణ్యగమనమునఁ బర్యవసించును.

నన్నయభట్టారకుఁడు భారతసంహితా రచనా బంధురుఁడగుచుఁ బ్రసన్నకథాకలితార్థయుక్తిని, నక్షరరమ్యతను, నానారుచిరార్థసూక్తినిధిత్వమును నిల్పుకొనుచు వచ్చెను. వాగను శాసనుని కథాసంహితా రచన దృష్టిని గుర్తించియే ఉభయ కవి మిత్రుఁడు గద్యపద్యములతోఁ బ్రబంధమండలిని నిర్మింతు ననెను. నన్నయకాని, తిక్కనకాని భారతమును సంస్కృతమునుండి యథాతథముగ ననువదింపవలయుననుకొలేదు. సంస్కృతమున భారత మితిహాసము; తెలుఁగునఁ గావ్యము. నన్నయ "నానేర్చువిధంబున నికావ్యంబు రచియించెదనని దొడంగి" నాఁడు. తిక్కన కూడ "ఇమ్మహాకావ్యంబు" అనియే గురుతించి చేకొనినాఁడు. నన్నయభట్టు "జననుత కృష్ణద్వైపాయన ముని వృషభాభిహిత మహాభారతబద్ధనిరూపితార్థమేర్పడఁ దెనుఁగున రచి"యించినాఁడు. తిక్కన "ఇమ్మహా కావ్యంబు నర్థంబు సంగతంబు సేయుదు" నన్నాఁడు. దీనిని బట్టి యీకవులిర్వురును దమ నేర్పునుబట్టి, వ్యాసనిరూపితార్థ మేర్పడు నట్లుగాఁ దెనుఁగున రచియింతు మని తెల్పినట్లే యైనది.

సంస్కృతభారతము మేలిమి బంగారపుముద్ద. ఆంధ్రభారతము చక్కనిహారము. దీని కాకృతి (Design) రచించి, కొంతవరకు నగను

జేసి యిచ్చిన మహాశిల్పి నన్నయ. ఆ యాకృతిని జక్కఁగా గ్రహించి నగను బూర్తిచేసి ఆంధ్రశారదాకంఠసీమ నలంకరించిన మహానుభావుఁడు తిక్కన.

తెనుఁగుకవులు కావ్యదృష్టితో వ్రాసినవారగుటవలన నేకథ కాకథనే ఆద్యంతములు చక్కఁగా సమన్వయించుకొనుచు రచన సాగించినారు. దీని కవరోధములుగా నుండు కథలను, వంశచరిత్రలను, స్తుతులను దొలఁగించివేయుటకు సంకోచింపలేదు. కావుననే యాంధ్రభారతము విశ్వజనీనమై, ఆంధ్రావళి మోదముఁ బొరయునట్లావరించినది.

సభాపర్వము ద్వితీయాశ్వాసమున నన్నయభట్టారకుని కవితా వైశిష్ట్యమును గమనింతము.

శిశుపాలవధకు సంబంధించిన కథ డెబ్బదియొక పద్యగద్యములలో నున్నది. ఆకథాభాగమున నాద్యంతములను నన్నయ సమన్వయించిన విధమిది— "తొల్లి బ్రహ్మాది సురగణ ప్రార్థితుండయి యఖిల మహీభారావతరణార్థంబు నారాయణుండు యదువంశంబున నుదయించుటయు" నని మొదలిడి "అంత ననంతశయనుండు శిశుపాలు సంస్కరింపం బంచి" యని ముగించినాఁడు. ఇది కేవలము కృష్ణుఁ డవతారపురుషుఁడను విషయమును నిరూపించుటకు మాత్రమే కాక, భవిష్యద్భారతరణమునకు జ్ఞాపికయగుచున్నది. "అనంతశయనుఁడు" అనుటవలన జయవిజయుల శాపవృత్తాంతమంతయు ధ్వనింపఁజేసినట్లయినది. అందుకొఱకే మూలమునఁగల యర్థమును మార్చి యిట్లుపలుకవలసి వచ్చినది.

"పాండవ స్త్వబ్రవీద్ భ్రాతౄన్, సత్కారేణ మహీపతిమ్
దమఘోషాత్మజం వీరం, సంస్కారయత మా చిరమ్"

సంస్కృతమున ధర్మరాజే పనికట్టుకొని శిశుపాలునికి సంస్కారము జరుపవలసినదిగాఁ దన తమ్ములకుఁ దెల్పును. కాని, యిక్కడ ధర్మరాజెవ్వరు? కేవలయజ్ఞదీక్షితుఁడు. తాను జూచుచు నుండవలసినదే కాని యేమిచేయుటకును జాలఁడు. సర్వభారము కృష్ణునిపైఁ బడినది. అందువలన నతఁడే సర్వమును నిర్వహింపవలయును. కావుననే కృష్ణుఁడా యధి

కారమును హస్తగతమొనరించుకొనెను. ఇంతవరకు లౌకికవిషయము. కాని శిశుపాలుఁడెవరు? అను ప్రశ్నయుండనేయున్నది. దానికై నన్నయ యొకవిశేషణముతో నొకకథనే ధ్వనింపఁజేసినాఁడు. "అనంతశయనుఁడు" అనుటతోడనే విష్ణుమూర్తి లక్ష్మీదేవితో నున్నకాలమున సనక సనందనులు దర్శనముఁగోరుట, జయ విజయులు నివారించుట, శాపవృత్తాంతము మున్నగునదంతయుఁ గ్రమముగా స్మృతిపథమునఁ గదలాడును. ఇది అల్పపదముల ననల్పార్థరచన.

మొదటిభాగమున నర్ఘ్యమున కర్హుని దెల్పుమనఁగా భీష్ముఁడు ధర్మజునితో నాచార్యుఁడు మున్నగు నారుగురను జెప్పి

"ఏషా మేకైకశో రాజన్ అర్ఘ్యమానీయతా మితి
అథ చైషాం వరిష్ఠాయ సమర్థా యోపనీయతామ్"

అని మూలమున బల్కెను.

దీనిని బట్టి గుణములయందు వరిష్ఠుఁడు, సమర్థుఁడైన వాని కగ్రపూజచేసి మిగిలిన వారిని గ్రమశః పూజింపవలయు నని యర్థము. కాని నన్నయ భీష్మునిచే నిట్లు పలికించెను—

"వీరిలో,
బ్రీతి నెవ్వఁడు సద్గుణంబులఁ బెద్ద యట్టి మహాత్ము వి
ఖ్యాతుఁ బూజితుఁ జేయు మొక్కనిఁ గౌరవాన్వయవర్ధనా"

దీనివలన నొకప్రయోజనమున్నది. భీష్ముని వచనమున ధర్మతనయుఁడు కృష్ణున కర్ఘ్య మిచ్చెను. శిశుపాలుఁ డధోక్షజుఁడనునది సాభిప్రాయవిశేషణము. అక్షజములైన వాని నధఃకరించు వాఁడని యర్థము. ఇఁక ముందు జరుగఁబోవునదదియే. అందువలననే కేవల శబ్దసౌందర్యముకోసమను ప్రాసము వేసినట్లున్నను విశేషణౌచిత్యమును గథ కనుగుణముగా దిద్దుకొన్నాఁడు నన్నయ. దీనిని లోనారసి "మేలు" అనవలసినవారు

కవీంద్రులు. మూలమున "శిశుపాలస్తు తాం పూజాం వాసుదేవే న చక్షమే" అని మాత్రమే యున్నది.

ఈ యాక్షేపమంతయు నొక పెద్ద యుపన్యాసము. దీనియందు శిశుపాలుఁడు తన నేర్పంతయు నుపయోగించి సభ్యులను గలియఁగట్టు కొనుటకు యత్నముచేయుట కనిపించును. అందుఁగు రాజులు విశిష్టారాధ్యులు-అర్ఘ్యులు; మహీదివిజులు పూజ్యులు. ఇట్లనుటవలన సభలో సాముఖ్యమును సంపాదించుకొనుట సులభము. దీనితరువాత ధర్మరాజుపైఁ బ్రశ్నలవర్షముఁ గురిపించుచున్నాఁడు. పూజనీయులైన యారుగురియందును గృష్ణుఁ డెవ్వఁడు? ఇది యాతని ప్రశ్నలసారము. ఇంత వరకు భీష్ముని పనుపువలననే ధర్మజుఁ డిట్టి యవివేకము నాచరించెనని తెల్పుచు ధర్మజునిఁగూడఁ బ్రశంసించుట సాగించెను. రాజులు ధర్మజునిగురించి పురుషవిశేషవిత్తముఁడు, పూజ్యుఁడు-అని భావించి యాగమునకు వచ్చిరఁట! వారి కన్నివిధముల నవజ్ఞ సేయుట పాడియేనా? అని ప్రశ్న. ఇది కేవలము ధర్మజునికి వేసినప్రశ్న కాదు. ధర్మరాజక్కడి రాజులందరి నవమానించెనని తెలియఁజెప్పి వారిని గూడఁ దనతోఁ గలుపుకొనుటకుఁ జేసిన యత్నము. అంతే కాదు. "ఈ యవనీశ్వర ప్రవరు లిందఱు నిన్ను నగంగ నిట్లుగాఁ జేయుదె" అని కూడ నన్నాఁడు. దీని వలన నచ్చటిరాజులు ధర్మరాజున కవమానకరముగా నవ్వవలయు నని యతని సూచన. ఇది వెంటనే కార్యరూపమును దాల్పలేదు. కావునఁ దానే సభాభవనమును వీడిపోయెను. ఉపన్యాసకళ కిది చక్కని యుదాహరణము.

కృష్ణుఁడు తగని యర్ఘ్యమును గొనియె నని తెల్పుచు "గోవిందుఁడు" అని యుపయోగించెను. గోవులను రక్షించువాఁడని, గొల్ల యని శిశుపాలుని భావము. "ధీయుత యంచు ధర్మజ నదీసుత కృష్ణుల నెగ్గులాడుచున్" శిశుపాలుఁడు ధర్మజుని సంబోధించుటలో "ధీయుత"

అనినాఁడు. నన్నయ దీని నెగ్గులాడుటగానే తెల్పినాఁడు. దీనిని గాకు ప్రధానముగా నర్థముచేసికొనవలయును. అప్పుడుబుద్ధిమంతుఁ డను నర్థము కాక బుద్ధిహీనుఁడనియే భాసించును.

"క్లీబే దారక్రియా యాదృ, గంధే వా రూప దర్శనమ్
అరాజ్ఞో రాజవత్ పూజా, తథా తే మధుసూదన"

అని మూలమున శిశుపాలుఁడు కృష్ణునే సంబోధించి నట్లున్నది. అట్లు చేసిన శిశుపాలునిలో బిగువు సడలిపోయినట్లే! ప్రతిస్పర్థతోఁ దనకుఁ దానై మాటలాడఁడు. అందువలననే, ఆంధ్రభారతమున శిశుపాలుఁడు ధర్మజునితోనే పల్కును. ఇది మొకటి మెట్టు. దీనిని దాటిన పిమ్మటఁగాని శత్రువులు పరస్పర మభిముఖులు కారు. "అరాజ్ఞో రాజవత్ పూజా" అనున దప్పుడు జరిగిన దనియే శిశుపాలుని భావము. దానిని మరలఁ జెప్పుట పునరుక్తియే కాని ప్రయోజనము శూన్యము. అందువలన నన్నయ మొదటి రెండు నిదర్శనములకు నడుమ "చెవిటికి మధురగీతియును" అని చేర్చి కృష్ణుని పూజించుట యటువంటి దని ధర్మజునికే చెప్పించినాఁడు.

సభను వీడిపోవుచున్న శిశుపాలునిఁ బ్రియవచనములతో ననునయించుటకు ధర్మజుఁడు వెంటనరిగెను. మూలమున "తతో యుధిష్ఠిరో రాజా శిశుపాల ముపాద్రవత్" అని యున్నది. తెలుఁగులో "శిశుపాలు పిఱుందనచని" అని యనుట వలన ధర్మజుని పాత్రకు మూలమున లేని గాంభీర్య మలవడినది. ఆగాంభీర్యమాతని సంభాషణము నందుగూడ నిలిచియేయున్నది. ఆరంభమునందే ధర్మజునికి వాడిన విశేషణములలో "ధృతిమంతుఁడు" అనున దొకటి. దానికి సార్థక్య మీఘట్టమున సర్వత్ర కన్పట్టును. మూలమున యుధిష్ఠిరుని మాటలివి—

"నేదం యుక్తం మహీపాల, యాదృశం వై త్వముక్తవాన్
అధర్మశ్చ పరో రాజన్, పారుష్యం చ నిరర్థకమ్.

న హి ధర్మం పరం జాతు, నావబుధ్యేత పార్థివః
భీష్మః శాంతనవ స్త్వేనం, మా వమంస్థా స్త్వమన్యథా
పశ్య చైతాన్ మహీపాలాం, స్త్వత్తో వృద్ధతమాన్ బహూన్
మృష్యన్తే చార్హణాం కృష్ణే, తద్వత్త్వం క్షన్తు మర్హసి
వేద తత్త్వేన కృష్ణం హి, భీష్మ శ్చేదిపతే భృశమ్
న హ్యేనం త్వం తథా వేత్థ, యథైనం వేద కౌరవః”

“నీకంటె వృద్ధులయిన రాజు లనేకులున్నారు. వారు సహించిరి. నీవును సహింపుము” అనుటవలన ధర్మరాజు కృష్ణునిఁ దక్కువపఱుచుచున్నట్లే యనిపించును. ఆంధ్రమున నర్థమట్లేయుండియు భావము మారినది. ఇది కేవల మనునయించుటయే కాదు; మందముగా మందలించుట కూడ.

“భూరిగుణోన్నతు లనఁదగు, వారికి ధీరులకు ధరణివల్లభులకు వా
క్పారుష్యము చన్నె మహా, దారుణమది విషము కంటె దహనము
కంటెన్.

ఆదిజుఁడైన బ్రహ్మయుదయంబున కాస్పదమైనవాఁడు వే
దాది సమస్తవాఙ్మయము లందుఁ బ్రశంసితుఁడైనవాఁడు లో
కాది త్రిలోకపూజ్యుఁ డని యాత్మ నెఱింగి పితామహుండు దా
మోదరుఁ జెప్పెఁ బూజ్యుఁడని యుత్తమ కా కిదియేమి దోసమే.
పరమార్థప్రతిభుఁ దమో,హారు నచ్యుతు. భీష్ముఁ డెఱిఁగి నట్లెఱుఁగఁగనీ
కరిది శిశుపాల, పెద్దల చరితం బల్పులకు నెఱుఁగ శక్యమె యెందున్.
గురుఁ డని సమస్త లోకో, త్తరుఁడని నీకంటె వృద్ధతములైన నరే
శ్వరు లచ్యుతు సర్వస,నెడఁ, గరమభినందింప నీకుఁ గాదనఁ దగునే”

శిశుపాలునియందు ధరణి వల్లభునకుఁ గావలసిన గుణములు లేవని చెప్పినట్లయినది. భీష్మునకు “పితామహ” శబ్దము నుపయోగించి బ్రహ్మయంతటివానిని జేసినాఁడు. అట్టివాఁడు మాత్రమే “బ్రహ్మయుదయంబున కాస్పదమైన వానిని” గూర్చి తెలిసికోఁగల్గును. “యుక్తము కాకిది యేమి

దోసమే"యనుట శిశుపాలుని మందలించి యొప్పించుట కాని బతిమాలుటకాదు. కృష్ణుని గొప్పదన మల్పుల కెఱుఁగశక్యము కాదనుట వలన శిశుపాలుఁ డల్పుఁడని చెప్పినట్లైనది. బుద్ధిమంతులు పెద్దలను జూచి నైన నేర్చుకొందురు. శిశుపాలుని కదియుఁజేతకాదు. వృద్ధులయిన రాజులభినందించుచుండగా నీకుఁగాదనఁదగునా? అనుటలో నీవు నభినందింపక తీరదన్నట్లే యున్నది. కాని, సంస్కృతమునందువలె "క్షన్తు మర్హాసి" అన్నట్లులేదు. దీనివలన ధర్మజుఁడు పైకి బతిమాలుచున్నట్లే యున్నను గొంత తీవ్రతకూడ చూపకపోలేదు.

కాని శిశుపాలునివంటి వానికది చాలదు. అందువలన భీష్ముఁడే కలుగఁజేసికొనెను. ఇచట మఱియొక యుపన్యాసము. శిశుపాలుఁడు ముందు పోవుచున్నాఁడు. ధర్మజుఁడు వెంబడి మాటాడుచున్నాఁడు. భీష్ముఁడు లేచి, ధర్మజునివంకకుఁ దిరిగి పలుకుట ప్రారంభించెను. ఇందు ధర్మజునుద్దేశించిన దానికంటె శిశుపాలు నుద్దేశించినదే యెక్కువ. అయినను శిశుపాలునితోఁగాక ధర్మజునితోనే మాటాడుటవలననామాటలకు ఒకమహత్త్వము సిద్ధించినది. సభదృష్టియంతయు శిశుపాలునిపైనే యున్నది. భీష్ముఁడుకూడ ధర్మజునివైపు తిరిగియున్నను వ్రేలితో శిశుపాలునిఁ జూపుచునేయున్నాఁడు. ఆ పద్యమిది—

"పలితదుర్ణయుండు శిశుపాలుఁడు బాలుఁడు వీనినేల భూ
పాలక నీకుఁబట్టువఱుపఁ మరి ధర్మువెఱుంగ వీనికిం
బోలునె రాగకోపపరిభూతమనస్కున కల్పరాజ్యల
క్ష్మీలలనాంధబుద్ధి కనిమిత్తమహత్త్వవివాదశీలికిన్"

శిశుపాలునకు బాలునకుఁగల సామ్యము ననుప్రాసముతోఁ జక్కఁగాఁ దెలిపినాఁడు కవి. "భూపాలక" అను శబ్దములో మొదటియక్షరమును మొదటిపాదమున వేసి, మిగిలిన మూఁడక్షరములను రెండవపాదములోనికిఁ దెచ్చుటవలన నొకదైర్ఘ్యము వచ్చినది. ఇది ధర్మజుని పెద్దతన

మును సూచించును. "నీయంతటివాఁ డింత బాలు ననునయించుట యేమి?" అనుటవలన ధర్మజునాధిక్యము, శిశుపాలు నల్పత్వము రెండును స్పష్టమగుచున్నవి.

"వీనికిం బోలునే" యనుటవలన భీష్ముఁడు శిశుపాలుని నిర్దేశించుచున్నాఁడనియే యనుకొనకతప్పదు. నన్నయభట్టు రంగనిర్దేశమును (Stage direction) వాచ్యముగాఁ జేయఁడు. చేయకున్నను జేసినంత స్పష్టముగా నుండును. ఒక్కమారు కాదు-మూఁడుమారులు భీష్ముఁడు శిశుపాలుని వంకఁ వ్రేలెత్తి చూపుచు ధర్మజునితో ననినాఁడు. సభయంతయు నిదివరకే శిశుపాలుని వంకకుఁ దిరిగినది. ఇప్పుడు భీష్ముని యీ మాటలతో మిక్కిలి యాకర్షింపఁబడినది. శిశుపాలుఁడు రాగకోప పరిభూతమనస్కుఁడు; అల్పరాజ్యలక్ష్మీగలితాంధబుద్ధి; మూఁడవది సందర్భమునకుఁ దగినవిశేషణము-అనిమిత్తమహాత్సరివాదశీలి. ఈవిధముగా శిశుపాలుని స్వభావమును మూఁడుముక్కలలో విశ్లేషించి చూపినాఁడు భీష్ముఁడు. ఇప్పుడు శిశుపాలుని వంకకే తిరిగినాఁడు. అతఁడన్న మొకటి వాక్యమేయిది. "అవినయబుద్ధివై హరికి నర్ఘ్య మయోగ్యమ యంటినీవు మూర్ఖవు శిశుపాలయింకఁ బలుకఁగ వలసెఁగ." నీవుమూర్ఖుఁడవు. అందువలననే అవినయబుద్ధితో హరి కర్ఘ్యము తగదంటివి. నీకుఁజెప్పిననే గాని తెలియదు. అందువలననే పలుకవలసి వచ్చినదని భీష్ముఁడు మొదలు పెట్టెను. ఈ మాటలను బలుకుటను గూర్చి కాదు భీష్ముఁడు పలుకుచున్నది. తమ గొప్పతనమును దాము చెప్పుకొనరాదు. కాని "సభలోననున్న యీ యవనిపులెల్ల నాతనిదయం బరిముక్తులు వానిచేత నాహవజితులుం దదీయశరణార్థులు" అను విషయమును జెప్పవలసినది. మూర్ఖుఁడైన శిశుపాలుఁడు దీనిని దెలిసికొనలేఁడు. అందువలనఁ జెప్పక తప్పినదికాదు. అందులకే "ఇంకఁబలుకఁగ వలసెఁగ" అని భీష్ముఁడు తన వినయమును దెల్పుకొనియే, తప్పనిసరియగుటవలన గొప్పతనమును

చెప్పుకొనుచున్నట్లు పల్కినాఁడు. ఈ విధముగాఁ గృష్ణుని సర్వమాన్యత్వమును స్థాపించుచు భీష్ముఁ డుపన్యసించుచుండును.

సంస్కృతభారతమున భీష్ముఁడు కృష్ణుని మహత్త్వమును దైవత్వమును నిరూపించుచు మధుకైటభవధ, దశావతారవర్ణన, శ్రీకృష్ణబలరాముల బాలలీలలు, నరకాసురవధ. బాణాసురవిజయము మున్నగు కథలను విపులముగా వర్ణించును. దీనివలన భగవత్తత్త్వమును నిరూపించుట యగునో లేదో కాని, కథాతంతువు మాత్రము నిశ్చితముగా నుచ్ఛిన్నమగును. దాదా పేడువందలు శ్లోకములు గల భాగమును దొలఁగించి నన్నపార్యుఁడు కథను బ్రసన్నము గావించినాఁడు.

"ఏవ ముక్త్వా తతో భీష్మో, వీరరామ మహాబలః
వ్యాజహారోత్తరం తత్ర, సహదేవోఽర్థవ ద్వచః"

భీష్ముఁడు చెప్పఁదలఁచినదంతయు వరుసగాఁ జెప్పి విశ్రాంతిని గొన్నపిమ్మట సహదేవుఁడర్థవంతమైన వచనమును బలికె నని సంస్కృతమునఁ గలదు. ఇక్కడ సన్నివేశమును బట్టి చలనము (Movement) అవసరము. అట్టియెడ భీష్ముఁడు తనయుపన్యాసమును ముగించినపిమ్మట సహదేవుఁడు పలికె ననుటకంటె, భీష్ముఁడు పలుకుచుండగనే సహదేవుఁడందుకొనె ననుట యుచితముగా నుండును. భీష్ముని పనుపువలన ధర్మజుఁడు కృష్ణుని కర్ఘ్యమిచ్చెను. ఆ యర్ఘ్యమును దెచ్చినవాఁడు సహదేవుఁడు. కావునఁ దనకును గొంత బాధ్యత కలదు. ధర్మజునిమాటలు ప్రియపూర్వకములయిన సాంత్వనములు. అవి శిశుపాలుని మనసునకెక్కవు. అందువలననే భీష్ముఁడు ధర్మజుని వారించి, తానే శిశుపాలునికిఁ దెలుపఁబూనుకొనినాఁడు. భీష్మునిలోఁ దీవ్రతయున్నది. కాని, అది పెద్దతనముతోఁ గలిసి యొకక్రమములో సాగినది. ఇదికూడ శిశుపాలుని మనస్సునకెక్కదు. అందువలన సహదేవుఁడు క్రమముకాని, వాదము

కాని లేని ధోరణిలో సభలో నిల్చినాఁడు. వయస్సునఁ జిన్నవాఁడగుట వలన నా తొందరపా టతనిలో సహజము.

"ఎడపక యర్ఘ్య మచ్యుతున కిచ్చితి; మెచ్చిన దీనికిందొడం
బడమని దుర్జనత్వమునఁ బల్కెడు వీరుల మస్తకంబుపై
నిడియెద నంచుఁ దాఁ జరణమెత్తె సభన్ సహదేవుఁ; డట్టిచో
నుడిగి సభాసదుల్ పలుకకుండిరి తద్దయు భీతచిత్తులై"

సహదేవుని గురించి యీ సందర్భమునఁ గవి యేమియుఁ జెప్పకుండ సన్నివేశమధ్యమున నాతనిమాటలతోనే ప్రవేశపెట్టుట సభలోని సభ్యులకు వలెనే మనకు నొకవెరగుపాటును గల్పించును. అతనిమాటలలో వాదము లన్నింటికి మించినతీవ్రత, నిరంకుశత్వము నున్నవి. "దీనికిం దొడంబడమని" యన్నచోట నా యక్షరసమావేశము సహదేవుని మాటలలోని వేగమును, దడబాటును బట్టియిచ్చును. "మస్తకంబుపై నిడియెద"నని వాక్యమును సమాప్తము గావించినాఁడు సహదేవుఁడు. "ఇడుట" యేమిటో సహదేవుఁడు తనమాటలలోఁ దెల్పలేదు. మాటను దాటిన యుద్రేకమువచ్చి చేష్టారూపమును దాల్చినది. చేష్టను నన్నయ "తాఁ జరణమెత్తె సభన్" అని తెల్పినాఁడు. ఇచ్చట సన్నివేశమున కెంతయో బిగువు కలిగినది. భీష్ముఁడు మాటాడుచున్నంతసేపు సభలో నక్కడక్కడ వారిలో వారు మాటాడుకొనుచున్నారు కాఁబోలు! కాని యీవిషయ మప్పుడట్లనిపించలేదు. సహదేవుని యుద్ధృతి చూచునప్పటికి "ఉడిగి సభాసదుల్ పలుకకుండిరి తద్దయు భీతచిత్తులై" అనవలసివచ్చినది. దేని నుడిగిరో చెప్పకుండనే నన్నయభట్టు సభాసదులు పలుకకుండిరని తెల్పినాఁడు. అంతకు ముందొక స్వరూపములేని శబ్దమున్నది. అంతకంటె నిశ్శబ్దతగల సమయము వచ్చినపుడే అంతకు ముందు శబ్దమున్నదని గమనింతుము. ఈయుడుగుట యట్టిశబ్దమునే

ఉద్రేకము కల్గినవాఁడు మాటలు తక్కువపల్కును. అంతేకాక వాక్యమున నన్వయము సరిపోయినదో, లేదో అతనికిఁ బట్టదు. పై వాక్యమున నదే కన్పించును. సంస్కృతమూలమున సహదేవుఁ డన్న మాటలివి—

"కేశవం కేశిహంతార, మప్రమేయ పరాక్రమమ్
పూజ్యమానం మయా యోవః, కృష్ణం న సహతే నృపాః
సర్వేషాం బలినాం మూర్ధ్ని, మయేదం నిహితం పదమ్
ఏవముక్తే మయా సమ్య, గుత్తరం ప్రబ్రవీతు సః
స ఏవ హి మయా వధ్యో, భవిష్యతి న సంశయః."

అని చెప్పి పూజనీయ వ్యక్తులను సహదేవుఁడు పూజించె ననియున్నది. మొదటిలోనే నన్నయ దీనిని మఱొకవిధముగా మార్చుకొనుటవలనఁ బూజాప్రవృత్తియే లేకపోయినది.

"తతోఽపతత్ పుష్ప వృష్టిః, సహదేవస్య మూర్ధని
అదృశ్యరూపా వాచశ్చా, ప్యబ్రువన్ సాధు సాధ్వితి."

దీనినంతటిని నన్నయభట్టారకుఁ డొకటిన్నర పాదములలోని కనువదించి, మిగిలిన రెండున్నర పాదములను దాను సొంతముగాఁ బూరించెను—

"చెలువుగఁ బుష్పవృష్టి గురిసెన్ సహదేవు పయిన్ దివంబునన్
వెలయఁగ సాధువాదములు వించె"

ఇంతటితో ననువాద మైనది. ఈ సన్నివేశము సభ్యులహృదయములం దెట్లు పని చేసెనో తెల్పుట యావశ్యకము. కాక, సభలోఁ గలహాభోజనుఁడైన నారదుఁడున్నాఁడు. అతని కింతకంటె మంచియవకాశము లభింపదు. కావున నన్నయ—

"సభాసదులెల్ల విస్మయా
కులిత మనస్కులైరి తనకుం జెయుఁ గృష్ణమృగాజినంబునుం
బలుమఱు వీచుచుం గలహబంధుఁడు నారదుఁ డాడె వేడుకన్."

అని పద్యమున మిగిలిన భాగమును బూర్తిచేసెను. ఈ యనుమూలకమైన యంశము వలన భవిష్యద్భారత రణమును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నాఁడు నన్నయ. దీనివలన రాజసూయము, తత్సందర్భమున జరిగిన శిశుపాల వధ భారతకథయందు మిక్కిలి ప్రాధాన్యమును వహించుచున్నవి. భారతయుద్ధమునకు బీజమిప్పుడే పడినట్లు, సందువల్లనే కలహాశనుఁడైన నారదుఁడానందముతో నృత్యముచేసినట్లు విశదమగుచున్నది.

ఈ నారదుఁడు నృత్యము సేయుట మఱొకవిధముగాఁ గథా గమనమునకుఁ దోడ్పడినది. శిశుపాలుని సేనాపతి సునీథుఁడు రోషమునొంది పరుషవచనములాడుచు స్వపక్ష క్షత్రియులనెల్ల నొక్కచోటఁ జేర్చి శిశుపాలుని యనుమతితో యుద్ధమునకు సన్నద్ధుఁడగుట సాగించెను. దేవతలు సహదేవుని నభినందించుట కాక, సభలోనే యున్న నారదుఁడానందనృత్యము సేయుట సునీథున కురిసిన పుండుపై నుప్పువేయుటయైనది. దానిపరిణామమే సత్వరయుద్ధసన్నద్ధత.

ఇచ్చట సంస్కృతమున నొక యస్పష్టత యేర్పడినది. సునీథుఁడును, శిశుపాలుఁడు నొక్కరో యిరువురో స్పష్టముగాలేదు. నన్నయ దానిని బరిహరించి సునీథుఁడు శిశుపాలుని సేనాపతియని స్పష్టము గావించినాఁడు. సరి. శిశుపాలునిపక్షమున యుద్ధప్రయత్నము సాగినది. ఇదంతయు వచనబద్ధము. పాండవులపక్షమునను సైన్యసమీకరణము సాగినది. ఇది పద్యబద్ధము. వచనముకంటెఁ బద్యమునకుఁ బ్రాముఖ్య మెక్కువ. మంచి యుద్ధృతిని జూపవలసి వచ్చినపుడు నన్నపార్యుఁడు చంపకమాల నుపయోగించును. ఇక్కడఁ గూడ నట్లే చేసెను. ధర్మరాజు సకలక్షత్రియక్షోభమును జూచి భయసంభ్రమాక్రాంతహృదయుఁడై నపుడు భీష్మునితో ననిన మాటలు 'తరలము' లోఁ జెప్పెను. ఈ పద్యమతని మనఃస్థితికనువగు గమనము కలది.

ఒక్కొక్కరాజు నొక్కొక్క ప్రళయసాగరమువలెనైరి. వారి వలన మఖమునకు విఘ్నము కాని, ప్రజలకపకారము కాని కలుగకుండ వారికిఁ జిత్తశాంతి యొనర్పవలయునని కోరెను. ఇందుఁ దనవారు, పెఱవారు నన్నదిలేకుండ నందఱకిని జిత్తశాంతి యొనర్పవలసినదని యుధిష్ఠిరుని కోరిక. ఇది పితామహుఁడే చేయఁగలఁడు. పితామహుఁడు సృష్టికర్త కదా! ఇచ్చట ననేకసాగరములను నన్నయ చూపించెను.

వ్యాసభారతమున—

"అసౌ కోపాత్ ప్రచలితో, మహాన్ నృపతి సాగరః
అత్రియత్ ప్రతిపత్తవ్యం, తన్మే బ్రూహి పితామహ"

అనియున్నది. ఏమిచేయవలయునో చెప్పుమని ధర్మజుఁడు భీష్ముని నడుగును. కాని నన్నయ చిత్తశాంతియొనర్పుమనియే ధర్మజుఁడు పితామహునిఁ గోరునట్లుచేసెను. మొదటినుండియుఁ బితామహునికి యుధిష్ఠిరుఁడిచ్చిన గౌరవమే యట్టిది. పూజార్హునకుఁ గావలసిన గుణములను, వానిని గలిగిన వ్యక్తినిగూడ శాంతనవుఁడే నిర్ణయించెను. కావున సంక్షోభమును వారించుట కూడ నతఁడే చేయవలయును. భీష్ముఁడు దానికిఁ జక్కని సమాధానము నిచ్చెను—

"నీ యజ్ఞమునకు విఘ్నము
సేయఁగ నోపుదురె యొరులు జితదైత్యుఁడు నా
రాయణుఁడు యజ్ఞపురుషుఁ డ
జేయపరాక్రముఁడు దీనిఁ జేకొని కావన్."

ఈ పద్యమంతయు నన్నపార్యుని సృష్టి. దైత్యులను జయించినవాఁడు, జ్ఞానమునకు నెలవైనవాఁడు, యజ్ఞపురుషుఁడు, జయింపరాని పరాక్రమముగలవాఁడు కృష్ణుఁడు. దైత్యాంశ వలన జన్మించినవారు శిశుపాలాదులు. అట్టివారిని జయించుట శీలముగాఁగలవాఁడు శ్రీకృష్ణుఁడు. మంచిచెడ్డలను, కర్తవ్యాకర్తవ్యములను గూర్చి విచక్షణచేయఁ

గలవాఁడు. కావునఁ గృష్ణుఁడేది తగునో అదే చేయును, గాని అన్యమాచరింపఁడు. యజ్ఞపురుషుఁడు కనుక యజ్ఞమునకు భంగముకలుగనీయఁడు. ఆ యుద్దేశముండవచ్చును గాని సమర్థత యుండవలదా? అన్నచో నతఁడజేయపరాక్రముఁడు. ఇవన్నియుఁగావచ్చును. కాని యుధిష్ఠిరుని యాగమన్న వానికేల యాసక్తియుండు నన్నచో "చేగొని కావన్" అన్నది సమాధానము. తనకుఁ దానుగాఁ గృష్ణుఁడే ఆబాధ్యతను స్వీకరించెను.

ఇందు సర్వశత్రురాజలోకము నలక్ష్యము చేసి భీష్ముఁడు మాటాడుచున్నాఁడు. ఇప్పుడు ప్రత్యక్షముగా రెండు వర్గములేర్పడిపోయినవి. మిత్రపక్షమును, శత్రుపక్షమును దేలిపోయినవి. ఎవరేని మనస్సును గప్పపెట్టుకొందు రను సంకోచములేదు. అందువలనఁ గృష్ణుని మహాత్త్వమును మాత్రమే కాక రాజుల యల్పత్వమును గూడ భీష్ముఁడు చెప్పుచున్నాఁడు.

రాజులందఱును గుక్కలవంటివారు. హరి సింహమువంటివాఁడు. కుక్కలు పెక్కులయినను "ఇభకుంభ దళన మహిష్ఠ నిష్ఠుర నఖముఖుఁడగు హరిమీఁద మొఱిగి యేమి" యుఁ జేయలేవు. కుక్కలు-పెక్కులు- ఈ రెండింటికి వేసిన ప్రాస వలన సమరూపత్వము బాగుగా గోచరించుచున్నది. కుక్కలెన్నియైనను గుక్కలే కాని మఱివేఱు కావు. ఇంకఁ గృష్ణునిఁగూర్చి చెప్పునప్పుడు పెద్దసంస్కృత సమాసమునే వేసినాఁడు. అదియును వర్గయుక్కులతో, సంయుక్తాక్షరములతోఁ గూడినది. దీనివలనఁ గృష్ణుని తేజము తెల్లమగును. పైనిచెప్పినదే చాలును. కాని అది యావేశముతోఁగూడి తీవ్రముగానున్నది. దానికి స్పష్టతను గూర్చుటకో యనునట్లు మరల "కృష్ణ సింహపరాక్రము నెఱుఁగకున్న వారె యెల్ల వారు" అనుచున్నాఁడు.

ఇవన్నియును శిశుపాలుని చెవులకు శూలములైనవి. అతనికి బాగుగాఁ గోపము పెచ్చుమీఱినది. పెదవులు బిగఁబట్టినాఁడు. "ఇమ్మది వెట్టి" అని మకారద్విత్వము ప్రాసముగాఁ బద్యము నతనిచేతఁ బలికించుట భావానుగుణచ్ఛందోభాషాయోజన సమర్థుఁడైన నన్నయకుఁ దగినది.

శిశుపాలుఁడు "నీయట్టి దురాత్ములుఁగలరె యెంత యధీరులె ధారుణీ పతుల" అని భీష్ముని నిందించుటయు, రాజులను బ్రోత్సహించుటయు: నొకేవాక్యములోఁ గలిపి వచ్చునట్లుచేసెను. శిశుపాలుఁడు రాజకీయతంత్రము నెఱిఁగి క్లిష్టమైన బుద్ధి నలవరుచుకొన్నవాఁడు. అతఁడేమిపలికినను గొందఱ సాముఖ్యమును గూడ సంపాదించుకోవలయు నని యెంచుట సర్వత్ర కానవగును. మూలమున శిశుపాలుని మాటలు సభామర్యాదకు భిన్నముగా నున్నవి—

"యుక్తమేతత్ తృతీయాం, ప్రకృతౌ వర్తతా త్వయా"

అని భీష్ముని నిందించును. తృతీయా ప్రకృతి యనఁగా నపుంసకుఁడని యర్థము. శిశుపాలుఁడు తనదూషణను బ్రారంభమునందు మాత్రమే కాక చివరఁగూడ నెందులకైన మంచిదన్నట్లు—

"కోహి ధర్మోఽస్తి తే భీష్మ, బ్రహ్మచర్యమిదం వృథా
యద్ధారయసి మోహాద్వా, క్లీబత్వాద్వా న సంశయః"

అని కలిపినాఁడు.

నన్నయదృష్టిలో శిశుపాలుఁడింత యధముఁడు కాఁడు; అంతే కాదు— ఈ ఘట్టమున శిశుపాలునిలో ద్వైవిధ్యము కనుపట్టును. కృష్ణుని భంగ్యంతరమునఁ బొగడును. శాపావసానసమయము సమీపించుచున్నది. అందువలననే శిశుపాలునిలో నిదివఱకులేని జ్ఞానము భాసించియు భాసింపక భాసించును. ఇదంతయు నన్నయ వాచ్యముచేయలేదు. శిశుపాలుని మాటలను బట్టియే మనకది యర్థమగును—

"నీ నాలుక యొక్కఁడయ్యె
వ్రయ్యవలయు నూఱు వ్రయ్యలు గాఁగ న
ట్లయినఁగాని చాల నతనిఁ బొగడ
నెల్ల దాని నేన యెఱుఁగుదు నెందు వాఁ
డర్ఘ్య దానయోగ్యుఁ డయ్యెఁ జెపుమ!"

భీష్మని కొకే నాలుకయున్నది. కృష్ణుని పరాక్రమగుణముల నెన్నవలయు నన్న నొక నాలుక చాలదు. కావున నొక్క నాలుక వందనాలుకలయినఁ గాని అతనిని బొగడుట సాధ్యము కాదు. పొగడుటకు భీష్ముఁ డెఱిఁగినది చాల స్వల్పమని కూడ శిశుపాలుని భావము. అందువల్లనే "ఎల్లదాని నేన యెఱుఁగుదు" ననుట. శిశుపాలునిలో నీవిధముగ నొక యున్నతిని దీసికొనివచ్చినాఁడు నన్నయ. "నపుంసకుఁడు" అను భావమును మార్చి "నీయం దనపత్యత యను నధర్మమున్నది" అని భీష్ముని నిందించినట్లు వ్రాసెను. అధర్మపరులకు మాత్రమే సంతతికలుగదు; సంతతి కలుగకుండుటకూడఁ బాపమే యను నీతిం బట్టి శిశుపాలుఁడు బ్రహ్మచారియయిన భీష్మునకు ననపత్యత్వదోష మారోపించినట్లు నన్నయ సవరణ. దీనివలన శిశుపాలుని మూర్ఖత్వమును బాగుగాఁ బట్టియిచ్చినట్లయినది. కొంతసేపు శిశుపాలుఁడు భీష్ముని మరలనిందించును. కృష్ణునిగూర్చి "నా యెఱుఁగని యదియె జనార్దను బలంబు నత్యున్నతి యుగ్" అనును. అంతకుముందుఁ జెప్పిన "ఎల్లదాని నేన యెఱుఁగుదు" ననునప్పటి జ్ఞానమే శిశుపాలునికి మరల భాసించినది. అందువల్లనే బార్హద్రథిని మార్కొనలేక ముకుందుఁడు పాఱిపోయెనని నిందించుచున్నట్లుగాఁ బొగడినాఁడు. "ముకుందుఁడు" అనఁగా ముక్తినొసఁగువాఁడని యర్థము. కృష్ణుఁడు జరాసంధునితో యుద్ధముచేసి పాఱిపోయెను. కాక, యేమిచేయవలయును? ముక్తినీయవలయును. శాపావసానమునకు సమయము రావలయును గదా! రాలేదు కనుకనే పాఱిపోయెను. జరా

సంధుడు పరమబ్రాహ్మణ్యుఁడు. కృష్ణుఁడు బ్రాహ్మణవేషమున భీమార్జునులఁ దోడుచేసికొని వధియించెను. ఇదియు స్తుతియే. బ్రాహ్మణ్యుఁడైన వానికి బ్రాహ్మణేతరునిచేతఁగాక బ్రాహ్మణుని చేతిలోనే చచ్చుట యొకయూజట. కృష్ణుఁడట్లు జరాసంధునికిఁ దృప్తి ఘటించెనని శిశుపాలుని భావము. తరువాత రెండాటవెలదులు గలవు. ఈరెండింటియందు నొకరకమైన క్రమము పాటింపఁబడినది—

"బూతు వోడిగనట్లు వొగడెదు పొగడంగ
వలయు నేని సుగుణవంతులయిన
కర్ణశల్యులాదిగాఁ గల వీరులఁ
బొగడు చుండరాదె పొద్దువోక"

కృష్ణునిఁ బొగడుట యేల? నీకంతి పొగడ వలయుననియే యున్నఁ గర్ణుఁడు, శల్యుఁడు మున్నగు వీరులను బొగడుము- అని చెప్పెను. దీని వలన శిశుపాలునికి వారన్న నిష్టము గావున నట్లనె యనిపించును. కాని అతని భావమది కానేకాదు. తరువాతి పద్యమునఁ గాని, అది తెలియదు—

"అన్యకీర్తనంబు నన్యనిందయుఁ దన్నుఁ
బరగఁ బొగడికొలుఁ బ్రిచ్చికోలు
నాపగాతనూజ యార్యవృత్తములు గా
వనిరి వీని నాద్యులయిన మునులు"

అని యనుటచేతఁ బొగడుట యతనికి సమ్మతము కాదని తేలినది. మఱి, కర్ణ శల్యాదుల నేల పొగడుమనుట? వారు పొగడ్తల నాశించువారు. కావున వారినిఁ బొగడినఁ బ్రయోజనమైన నుండును, కృష్ణుఁడు పొగడ్తలను గోరఁడు.

ఇట్లు శిశుపాలునిలో రెండు స్వభావముల నుంచి మాటాడించినాఁడు. సభలో నెల్లరుఁ దిట్టుచున్నాఁడనియే తలంచిరి. అట్లు దలఁపవలయు ననియే శిశుపాలుని భావము. లేనియెడల శాపముముగియదు.

ఈ విషయమును దెలుపుటకే యింకను నవకాశమిచ్చి నన్నయ తన మాటలుగా "అని రూక్షాక్షర వచనంబుల నాక్షేపించు" అను చున్నాఁడు. రూక్షాక్షరములో, రూక్షవచనములో అన్నఁజాలునే! రూక్షాక్షర వచనములని చెప్పుట యేల? ఇచట వచనములు రూక్షములు కానే కావు. అక్షరములు మాత్రమే రూక్షములు. అట్టి యక్షరములతోఁ గూడిన వచనములనే శిశుపాలుఁడు పలికెను. కావున వినుటకుఁ దీవ్రముగా నున్నను భావము తీవ్రము కాదని తెలుపుటకే నన్నయ యీ సమాసమును వాడెను.

శిశుపాలుని యౌద్ధత్యము భీమునికిఁ గోపముఁ దెప్పించినది. అతఁడు రౌద్రాకారమును ధరించెను—

"ప్రకటితకోపవేగమునఁ బద్మదళాయతనేత్రములఁ భయా
వక తరలీల దాల్చె నరుణద్యుతి నద్యతమై త్రిశాఖమై
భ్రుకుటి లలాటదేశమునఁ బొల్చెఁ ద్రికూట తటి త్రిమార్గగా
కృతిఁ బ్రభంజన ప్రియతనూజున కంతకమూర్తి కచ్చటన్.

ఇట్లు నిఖలక్షత్త్రియ త్రాస జననంబుగా నలిగి దంతసందష్టదారుణ ముఖుండై శిశుపాల నిర్మూలనాభీల సంరంభంబున నున్న భీమసేను వారించి భీష్ముండిట్లని చెప్పె"—

పై పద్యవచనములందున్న యక్షరసమావేశము భీముని వ్యాపమును దెల్పును. పరుషాక్షరములు, సంయుక్తాక్షరములును గలవు కాని సుదీర్ఘసమాసములు లేవు. లేకపోవుటకుఁ గారణము- భీముడు కోపావేశమున నోడలు మఱచిపోలేదు ; ఊగులాడుటలేదు. భీష్ముఁడు వారించినంతే నాగిపోయెను. ఈతనిస్వరూపము నింకొక పదిపద్యములు దాఁటిన తరువాత భీష్మునిచేత నన్నయ యనిపించును. భీముఁడు "గభీర పరాక్రముఁడు." అట్టివానికి సుదీర్ఘసమాసముల యోజనము నిష్ప్రయోజనము.

ఈ పద్య వచనములందలి భావమును, గొంతవఱకుఁ బదములను గూఁడ గ్రహించి తిక్కన విరాటపర్వమున నొక పద్యమును వ్రాసెను.

అదియుఁ జంపకమాలయే. విరటుని సభయందు సైరంధ్రి కీచకునిచేఁ బడినపాటును జూచిన భీమునివర్ణన. మొదటి రెండుపాదములను జిన్న మాటలతోఁ జెప్పి చివరిరెండు పాదములందు నొకటే సుదీర్ఘసమాసము వేసినాఁడు కవిబ్రహ్మ.

భీష్ముఁడు భీమునికి శిశుపాలజన్మవృత్తాంతమును దెల్పి కృష్ణుని చేత మాత్రమే శిశుపాలుఁడు నిహతుఁడగునని వెల్లడించెను. అట్లు కానియెడలఁ దాను బ్రదుకనిచ్చువాఁడను గానని కూడఁ దెల్పుచు "మదీయ చాప నిర్గత చటులోగ్రమార్గణ నికాయ పయోధిమునుంగక" అన్యులు తప్పించుకొని పోలేరనెను.

భీష్ముఁడు పలుకుచునేయున్నాఁడు. శిశుపాలుఁడు భీష్మభీములను దాటి జనార్దనున కభిముఖుఁడైనాఁడు. ఇంతవరకు ధర్మజునితో భీష్మునితో మాటలాడెనే కాని కృష్ణునితో "మాటాడలేదు. ఇప్పుడు కృష్ణుని కభిముఖుఁడై నిల్చి మాటాడుచున్నాఁడు. నన్నయ కృష్ణునకు విశేషణము "జనార్దనుఁడు" అని వాడెను. ఇదియెంతో యభిప్రాయముతో వేసినది. జన్మమునర్దించువాఁడు-అనగాఁ బునర్జన్మరాహిత్యమును గలుగఁజేయువాఁడని యర్థము. జరాసంధునితోఁ బోరినవాఁడు ముకుందుఁడు. ఇప్పుడు శిశుపాలుఁడు జనార్దనునికెదురుగా నిలఁబడినాఁడు. అంతే కాదు. పాండవులతో, భీష్మునితో బాటుగాఁ గృష్ణుని యుద్ధమునకుఁ బిలుచుచున్నాఁడు. కృష్ణుఁడిప్పుడు చక్రధరుఁడు. ఈ తరువాత నతనికిఁ జక్రముతోఁ బని గలుగునని తెల్పుటకే నన్నయ "చక్రధరుఁడు" అను విశేషణమును వాడినాఁడు. శేనియెడల మూలమునందువలెనే కృష్ణుఁడు చక్రమును దలఁచుకొనెననియు, నది చేతిలోనికి వచ్చినదనియుఁ జెప్ప వలసివచ్చెడిది. ఇంతయేల? ఒక్కవిశేషణముతో నది యంతయు సుందర సుఘటితమైనది.

ఇంతవరకును గృష్ణుఁడు కేవల సాక్షి. ఇపుడుమాత్రమే ఆతఁడు మాటలాడుట కుపక్రమించెను. అదియు శిశుపాలునితోఁ గాదు-రాజచక్రముతో. శిశుపాలుని దోషములను. దా నపరాధశతమును సైచుటయుఁ దెల్పెను. సభలోఁగూడ నిర్నిమిత్తముగా విరోధముఁ బూని అత్యంతశత్రుఁడయ్యెనని తెల్పుచుండఁగా శిశుపాలుఁడు మరలఁ గృష్ణుని ధిక్కరించుచుఁ బలికెను. అపుడు—

"అనల శిఖాలి దూల దనుజాంతకచక్రము రాజచక్రము
ల్లను భయమంద మూర్ధవికలంబుగ నప్పుడు సేసెఁ జేదిపం
దను తనువుర్వి బృహద్రుధిర ధారలు బోరన మీఁదికొల్కఁగాన్"

అతని పృథుదేహము వెల్వడు తేజము పరమేశ్వరు దేహముఁ జొచ్చినది. విస్మయోత్ఫుల్ల విశాలనేత్రులయి భూపతులెల్లరు జూచుచుండిరి. ఇది హఠాత్సంభవము! చక్రమెచ్చటినుండి వచ్చెనో చెప్పలేదు నన్నయ. దనుజాంతక చక్రము-దనుజుల నంతము చేయు చక్రము; దనుజాంతకుని చక్రము. అర్ఘ్యసమయమునఁగూడ గృష్ణునితోడనే యుండి యుండునా? ఉన్నదనియే యనుకొనవలయును. దానిని దెలుపుటకే యీ సన్నివేశమునకుఁ బూర్వము "చక్రధరుఁడు" అను విశేషణము వాడుట.

"జయ జయనినాదమున న
వ్యయు నంబుజనాభు భువనవంద్యు నుపేంద్రుం
బ్రియమునఁ బొగడు జనంబుల
దయిన మహాధ్వనియుఁ జెలఁగె నతితుములంబై"

మాటలను జాలఁదక్కువగా వెచ్చించుకొను నన్నయభట్టు నాలుగు విశేషణముల నొక్క మాటుగా వాడినాఁడు. ఇక్కడ ఒకసొగసున్నది. ధ్వనితుములముగా నున్నది. పొగడు జనులందరు సన్నిగొంతులతో జయనినాదము చేయుచున్నారు. కాని కృష్ణునిలో నొక్కొకయంశ మొక్కొకనికి నచ్చినది. అందువలన వారా యా యంశములను బేర్కొని

జయనాద మొనరించుచున్నారు. అవ్యయా! జయ! అంబుజనాభా! జయ! భువనవంద్యా! జయ! ఉపేంద్రా! జయ! — ఇవి అక్కడఁ జేసిన నినాదములఁట! నిర్వహణమున నద్భుతము వెల్లివిరిసినది. నాటకీయ రచనమున నిది పరాంకోటి నందుచున్నది.

ఈ విధముగా మొదటినుండి చివరివరకుఁ జలత్ సౌందర్య సంపన్నముగాఁ గథను నడిపించినాఁడు నన్నయ. మూలములోనున్న యత్యుక్తులను మాని, సహజములు, సరళములు స్వభావసిద్ధములు నయిన వర్ణనలతోఁ గావ్యమునకుఁ బుష్టిని గూర్చినాఁడు. అలంకారయోజన లేకపోలేదు. కాని, యున్నట్లే యనిపించలేదు. అంతటి ప్రయత్న గోపన మతనిది. తనకావ్యమెల్లను నాటకమువలెనే నడచినది. పాత్రలువచ్చి తమ సంభాషణలను దాము చెప్పుకొనెను. అవికూడ సంగ్రహములై, స్వభావసుందరములై కథాగమనమునకుఁ దోడ్పడెనే కాని వానిత్రోవ నవి పోలేదు. ఒక సన్నివేశమునుండి మరియొక సన్నివేశమునకు మారునపుడు రంగురంగుల కాంతుల కదలిక వలె నన్నయ యాకర్షించి, క్రొత్తసన్నివేశముఁ బాఠకుల చిత్తమును హత్తించును. ఇట్లు సర్వతోముఖమైన సౌందర్యమును సంపాదించుకొన్నది ఆంధ్రమహాభారతము నందలి శిశుపాలవధ.

స్వస్తి.

---

ఓం

శివాయ గురవే నమః

# నన్నెచోడుని గురుస్తుతితత్త్వము

శ్రీ బండారు తిమ్మయ్య

తేజము జాను తెన్గునుడి తీరును సంస్కృతసూక్తిబంధముల్
రాజిలుకల్పనాదులును గ్రాలఁగ శ్రీగురుపాదపద్మముం
దోఁజఁ గుమారసంభవన ముజ్జ్వలకావ్యముఁ బూన్చెసద్గుణా
భ్రాజిని నన్నెచోడగురు భక్తశిఖామణి సంస్మరించెదన్.

కుమారసంభవకృతికర్త నన్నెచోడుఁడు టెంకణాదిత్య, కవిరాజశిఖామణిబిరుదాంచితుఁ డని యాతనికృతివలనఁ దెలియుచున్నది. ఈతని కవితాశక్తి, కల్పనాయుక్తి గుర్తించినవిద్వాంసులు కవిరాజశిఖామణి బిరుద మీతనియెడ సన్వర్థముగ విరాజిల్లుచున్న దని నిర్వివాదముగ నంగీకరించుచున్నారు. కవిత్వతత్త్వమునుబట్టి యీతఁడు కవిరాజశిఖామణి యగుటయే కాక యఖండము ననన్యసామాన్యము నగు గురుభక్తి మహత్త్వమూలమున గురుభక్తిశిఖామణి యను సన్నుతికిఁ గూడ నెంతయుఁ దగియున్నవాఁ డనివిన్నవించుచున్నాను. ఈతని గురువు జంగమ మల్లికార్జునశివయోగి. అతనికి నన్నెచోడుఁడు తనకృతి నంకితమొనర్చి యాతనికిఁ బరమేశ్వరునితో నభేదాధ్యవసాయ మొనర్చి కృత్యవతరణిక యందును, ఆశ్వాసాద్యంతపద్యములందును బహుముఖములుగ నప్రతిమానముగఁ దన గురుభక్తిని బ్రదర్శించియున్నాఁడు. నిరుపమం బగు నిట్టి గురుభక్తిసంపన్నతతో గురుచరణారవిందములకె కృతి నంకిత మొనరించిన సుకృతివర్యుఁ డీతఁడు గాక యాంధ్రకవిలోకమున మఱి యొకఁడు గానరాఁడు. నన్నెచోడుఁడు నాతనిగురుఁడు జంగమమల్లికార్జునుఁడు కాలాముఖపాశుపత సంప్రదాయమునకుఁ జెందియుండు రని శైవసంప్రదాయజ్ఞు లగువిజ్ఞులు పలువురు తలంచుచున్నారు. ఆధ్యాత్మిక

గురుని సాక్షాత్పరమేశ్వరునిగ సంభావించుట భారతదేశమున సర్వమతీయులందును సనాతనాచారముగ నున్నది.

"గురు ర్బ్రహ్మా గురు ర్విష్ణు, ర్గురు ర్దేవో మహేశ్వరః
గురు స్సాక్షా త్పరబ్రహ్మ, తస్మై శ్రీగురవే నమః"

అను గురుస్తుతిపూర్వకశ్లోక మెల్లరకు నిత్యస్మరణీయముగ నుండుట సర్వవిశ్రుతము. ఇందుల కనుగుణముగనే "నాస్తి తత్త్వం గురోః పరమ్" "నగురోరధికమ్" అను సూక్తులు మనమతవాఙ్మయములందుఁ బ్రబలి యున్నవి. ఈసనాతనాచారసంప్రదాయములందుఁ దీక్షకరణశుద్ధిగసంపూర్ణభక్తివిశ్వాసములు గలసద్భక్తశిఖామణి యగుటచేతనే నన్నెచోడుఁ డుభయతారకముగఁ దనకృతిని నిజగురున కంకిత మొసంగి ధన్యుఁడయినాఁడు. శైవవాఙ్మయములో జంగమశబ్ద మనఃశ్రుతముగఁ జరలింగ (జీవి రూపమునఁ జలించుశివుఁడు అనఁగా శివభక్తుఁడు) వాచకముగనే యుపయుక్త మయియున్నది. "జంభృశంగచ్ఛతీతి జంగమః" అనిమల్లినాథుని నిర్వచనము. "చర తీతి చరః" అనిచరశబ్దనిష్పత్తి. కావున జంగమశబ్దము కులవాచకము గాదు- "లింగక్కె స్థల ఇల్ల, జంగమక్కె కుల ఇల్ల" అనుసూక్తి కన్నడమున సుప్రసిద్ధము. కాఁగా, చర,జంగమ, చరలింగ, జంగమలింగశబ్దము లేకార్థబోధకములుగనే కేవలము శివభక్తవాచకములుగానే శైవవాఙ్మయమునఁ బ్రయుక్తము లయి యున్నవి. నన్నెచోడుఁడు తనగురుఁడు మల్లికార్జునయోగికి జంగమోపశబ్దమును జేర్చిన దీభావముతోడనే కాని మఱియొకటి గాదు.

"మ. అమలజ్ఞానసుదీపవర్తి గొని వృద్ధాచారుఁడై వేదశా।
స్త్రములం దున్నసదర్థ మెల్లఁ గొని వి ద్వత్ప్రీతి గావించువా।
ని మహాత్మ్యం డనఁ బొల్చు పుణ్యనిధి వాణీముఖ్యు సర్వజ్ఞు, జం।
గమలింగం బగుమల్లికార్జును సదా కల్యాణుఁ గీర్తించెదన్"
(ఆ 1 ప 15).

"వ. అమృతాంశుభూషణావతారం బై విలసిల్లు జంగమమల్లికార్జున దేవు నఖిలజనశిరోవిభూషణామలదివ్యశ్రీపాదంబు లాకల్పాంతస్థాయిగా విభూషించు టశేషజగజ్జేగీయమానంబు." (ఆ 1 వ 16)

"వ. కావునం బరమశ్రీనగోత్తుంగమణిశ్రీసంగతమల్లికార్జునదేవతా కం బై జగంబులం బ్రత్యక్షం బై ప్రవర్తిల్లు జంగమమల్లికార్జున దేవుం డయి.....................మునిజనముఖమణిముకురుం డయిన జంగమమల్లికార్జునదేవునకు" (ఆ 1 వ 58).

"మనుజాకారమహేశున కనుపమచరితునకు మల్లికార్జునమునికిన్"
(ఆ 1 వ 66).

ఇత్యాదిగాఁ గృత్యవతరణికలో నన్నెచోడుఁడు వ్రాసినపద్యగద్యము లందలి విశేషణములు గూడ నిందుకుఁ దార్కాణములు. నన్నెచోడుని దృష్టిలో గురునికన్న భిన్న మయినది మఱొకటిలేదు. ఇష్టదైవము విద్యాగురుఁడు, ఆధ్యాత్మికగురువు, సత్ప్రభుఁడు, కూర్మినిజేశుఁడు సమస్తము నాతనికిఁ గృతిపతి యగుజంగమమల్లికార్జునుఁడే.

సీ. శరధినీరులుపయోధరములుగొనివచ్చికురిసి వారిధియందుఁ గూర్చునట్లు
చేనఁ బండినవిత్తుచేనికి ఫలకాంక్షఁ జేన్కఁ గ్రమ్మఱ వెదవెట్టునట్లు
రోహణాచలపతి కూహించివరరత్న సంచయంబున విభూషించునట్లు
తీర్థాళి కర్థిఁ ద త్తీర్థోదకంబుల, నెసకంబుగా నర్ఘ్య మిచ్చునట్లు.
గీ. నింగి ముట్టియున్న జంగమమల్లయ వరమునందుఁ గనిన వస్తుకవిత
దగిలి వారియంద నెగడింతు రవికి దీపమున నర్చలిచ్చు పగిది
వోలె. (ఆ 1 ప 49).

చ. గురువున కిష్టదైవమునకుం బతికిం గృతి చెప్పి పుణ్యముం
బరమును దేజముం బడయు, వచ్చు జగంబున నిశ్చయంబు మ
ద్గురువును నిష్టదైవమును గూర్మినిజేశుఁడు దాన నాకుఁ గా
కొరునకు నిట్లు సేకుఱునె, యొక్కట లాభము లెన్ని యున్ని
యున్, (ఆ 1 ప 50).

అను పద్యములందుఁ బూర్వోక్త భావములు వెల్లివిరియ నన్నెచోడుఁడు విస్పష్ట మొనర్చినాఁడు.

కేవలశివపారమ్యమును, శివునియుపరావతారముగాఁ దాను సంభావించి పూజించుజంగమమల్లికార్జునగురుని శివత్వమును బ్రకటించుటకే నన్నెచోడుఁడు తనశక్తినైపుణ్యముల నెల్లఁ గృతిరచనమున వినియోగించినాఁడు గాని స్వచరిత్రనిరూపకము లగు నైహికవిషయములయెడ నాతఁ డంతగా దృష్టిఁ బఱపక యుదాసీనతనే వహించెను. తనయునికిని గూర్చి కాని, కృతిరచనాకాలమును గూర్చి కాని తగువివరముల నాతఁ డుగ్గడింపలేదు. కావుననే తంజావూరుసరస్వతీమహాలు లిఖితపుస్తకాలయమందలి యేకైకతాళపత్రప్రతినిబట్టి యీతని కుమారసంభవప్రథమ భాగమును దొలుదొలుత 1909 సంవత్సరమున కీ॥ శే॥ శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు ముద్రించి ప్రకటించి నప్పటినుండి యీతనికాలమును గూర్చి కవిత్వతత్త్వాదికములఁగూర్చి వాదోపవాదము లాంధ్రవిద్వాంసులలో నిప్పటికి జరుగుచునే యున్నవి. "లోకములోని మహాకవులగతులన్నియు నిట్లే సందిగ్ధమతిభేదములపాలయ్యె. లోక మితనికవితాప్రభావ మిట్టి దని యెఱుంగఁ గాఁబోలుఁ గాలము తనప ట్టీయక మనల వంచించుచున్నది." అని శ్రీరామకృష్ణకవిగారు 1914 సంవత్సరములో నీకృతిద్వితీయభాగప్రకటన సమయమునఁ బీఠికలో వ్రాసియున్నారు. ఈ కావ్యమందలి భాష యొక్క వైఖరిని బట్టియు, మఱికొన్ని యితరసందర్భములబట్టియు నీకవి నన్నయభట్టునకుఁ బూర్వుఁ డని కొందఱు, నన్నయతిక్కనలకు నడిమి కాలమువా డని కొందరు పాల్కురికి సోమనాథునకు కిటీవలివాఁ డని కొందఱు తిక్కనకేతనలకుఁ గూడఁ దరువాతివాఁ డని కొందఱు పలువురు పరిపరివిధముల నిరూపింపనెంచుటయే కాని నిర్వివాదముగా నీతని దేశకాలము లిదమిద్ధముగ నింతవఱకు నిశ్చయింపఁబడలే దనుట సర్వవిదితము, అయినను గొందఱు బుద్ధిమం

తులు నన్నెచోడుఁడె యాతని దేశకాలములను దెలియఁదగు సాధనము లనుదన కావ్యమున గూఢముగా గర్భిత మొనర్చినాఁ డని విలక్షణము లనువింతవింతవిధముల నవలంబించి తమ యభిప్రాయములఁ బ్రకటించు చున్నారు. అందు మిత్రులు శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డిగారు ప్రము ఖులు. ఇందుఁ గూర్చి వారు వివిధ వ్యాసములను బహుపత్రికలలోఁ జిర కాలమునుండి ప్రకటించుటయే కాక తత్సారాంశము నెల్ల గ్రంథ రూపముగ గ్రథించి 1951 సంవత్సరమున "నన్నెచోడకవిచరిత్ర" అను పేర శ్రీ నేలటూరు వేంకటరమణయ్యగారి మున్నుడితోఁ బ్రత్యేక గ్రంథరూపముగఁ గూడఁ బ్రకటించినారు.

నన్నెచోడుఁడు కృత్యవతరణికలోఁ బూర్వగీర్వాణకవులఁ గొందఱ స్మరించి సంస్తుతించుసందర్భములో భారవినిగూర్చి; ఉద్భటునిగూర్చి యీక్రిందిపద్యములు రచించినాఁడు.

"భారవియు వస్తుకవితను,భారవియుం బరగి రుదయపర్వతశిఖరా
గ్రారోహణేంద్రకీలనగారోహణవర్ణనల జనారాధితులై
(ఆ 1 ప 20).

"క్రమమున నుద్భటుఁడు గవిత్వము మెఱయఁగు మారసంభ వము సాలంకా
రము గూఢవస్తుమయ కావ్యముగా హరులీల చెప్పి హరు మెప్పించెన్
(ఆ 1 ప 21).

ఇందు భారవినిగూర్చిన మొదటిపద్యమందలి ఉదయపర్వతశిఖరాగ్ర రోహణశబ్దములఁబట్టి ముం దుదాహరింపఁబోవు మఱొండుపద్యమందలి "ఉదయనగ" శబ్దమునుబట్టి నన్నెచోడుడు నేఁటి నెల్లూరుమండలమందలి యుదయగిరితాలూకాప్రాంతములను ఉదయగిరిరాజధానిగా నేలిన తెలుఁగుచోడరా జని శ్రీకృష్ణారెడ్డిగారు నిరూపించుచున్నారు.

కుమారసంభవావతారికలో నన్నెచోడుఁడు—

"అరినరపాలమౌళిదళితాంఘ్రియుగుం డయి పాకనాటియం
దిరువదియొక్కవేయిటికధీశుఁడు నాఁ జనుచోడబల్లికిం
జిరతరకీర్తికిన్, మహిమ్మీతిలకం బన హైహయాన్వయాం
బరశశిరేఖ యైనగుణభాసిని శ్రీసతికిం దనూజుఁడన్. (అ1 ప53).

"కలుపొన్నవిరులఁ బెరుగం గలుకోడిరవంబు దిశలఁ గలయఁగఁ జెలఁగన్
బొలుచు నొరయూరికధిపతి నలఘుపరాక్రముఁడఁ టెంకణాదిత్యుండన్.
(అ 1 ప 54).

అనుపద్యములలోఁ దాను పాకనాటిలో రాజ్యమేలినచోడబల్లికి నాతని సతీమణి శ్రీసతికి నుదయించిన తనయుఁడ ననియు, దక్షిణదేశమందలి యొరయూరి కధిపతి ననియు, టెంకణాదిత్యబిరుదాంచితుఁడ ననియు వ్రాసినాఁడు. జాతిపొన్నలు పూచునట్టిది, జాతికోఁడి గట్టిగాఁ గూయునట్టిది యని విశ్రుతి గన్న యొరయూరు దక్షిణదేశమునఁ గావేరీతీరమున నున్నది. కరికాలచోడుఁడు మున్నగునుప్రసిద్ధశివభక్తులు, చోళరాజులచ్చటనే పరిపాలన మొనర్చిరి. శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు "కావేరీతీరమున నుండునొరయూరిపురమునకుఁ గోబ (కోడి) యనునామము కలుగుట ద్రావిడభాషాకృతులలో సుప్రసిద్ధము- ఆంధ్రచోడులు కాలితకావేరీతీర కరికాలచోడవంశజు లగుటయు, నొరయూరిపురవరాధీశ్వరు లగుటయుఁ జోడశాసనవిఖ్యాతాంశములు అయినను నన్నెచోడునివర్ణనము నించుక చక్కఁగా నాలోచించిన నతఁ డొరయూరికే పరిపాలకుఁ డనియుఁ గేవలము కులక్రమాగతబిరుదముఁ జేర్కొన్నవాఁడుఁ గాఁ డనియుఁ దోఁపక మానదు." అని 1914 లోఁ బ్రకటితమైనకుమారసంభవము ద్వితీయ భాగముయొక్క యవతారికలోఁ దమయభిప్రాయమును బ్రకటించినారు. కాని తనతండ్రి చోడబల్లి పాకనాటిలోఁబరిపాలించినవాఁడని నన్నెచోడుఁడే చెప్పినప్పుడతఁడు గూఁడ తెలుఁగుదేశముననే పరిపాలన మొన

ర్చిన తెలుఁగుచోడుఁడే యని, ఒరయూరిపురవరాధీశత్వము, కరికాలచోడ వంశజత్వము కేవలము గౌరవార్థముగఁ గులక్రమాగతమర్యాద ననుస రించి చెప్పికొన్న విశేషణములే యనియుఁ దలంచుటయే సమంజస మని పలువురుపండితుల మతము- ఆంధ్రదేశమున పొత్తపి, కొణిదెన మున్నగు స్థలము లీ తెలుఁగుచోడులకు రాజధానులుగా నుండుట సుప్రసిద్ధము. కావున నన్నెచోడుఁడు నాతనితండ్రి చోడబల్లి పాకనాఁడుపొత్తపినాడులలో నెక్కడనోయొక్కచోట నుండి పరిపాలన మొనర్చియుండవచ్చును. కృష్ణా రెడ్డిగారు చెప్పినట్లు ఉదయగిరియే నన్నెచోడుని యునికి యని ఇద మిత్థముగ నిర్ణయించుటకుఁ దగిన యాధారములు లేవు. ఇఁక రెండవ పద్యములో నుదాహృతుఁడయిన యుద్భటుఁడు క్రీ.శ. 800 ప్రాంతమునఁ గాశ్మీరదేశరాజు జయాపీడుని యాస్థానమం దుండినవాఁడు. అతఁడు కావ్యా లంకారసంగ్రహమను అలంకారశాస్త్రగ్రంథమును రచించి లక్ష్యశ్లోక ములలోఁ గుమారసంభవకథలోని యేకదేశమగు పార్వతీపరిణయ సం దర్భమందలి హరుని వటువేషధారణమును గథావస్తువుగ గూఢముగ గర్భిత మొనర్చినాఁడు. నన్నెచోడుఁడు పూర్వోక్తపద్యమునఁ బయివిష యములనే ప్రశంసించి యుద్భటుని కుమారసంభవైకదేశమునకు గూఢ వస్తుమయకావ్యవిశేషణము నుద్దేశించెనని కీ.శే. శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి గారు తమయభిప్రాయమును బ్రకటించిరి. హరలీలాస్తవకృతి మఱొకటి గూడ నుద్భటుఁడు రచించినట్లు మల్లికార్జునపండితుని శివతత్త్వసారపద్య మును బట్టి వ్యక్తమగును. నన్నెచోడునిపద్యమందలి క్రమమును బట్టి గూఢ వస్తుమయకావ్యవిశేషణము హరలీలతో నన్వయించుట సమంజస మని తోఁచును. ఏమయినను నీవిశేషణము ఉద్భటుని కావ్యములలోఁ గుమార సంభవమునకో, హరలీలాస్తవమునకో చెల్లునుగాని నన్నెచోడుని కుమార సంభవమునకుఁ గాదని చెప్పనక్కఱలేదు. కాని మనకృష్ణారెడ్డిగారు దీని నాధారముగాఁ గొని నన్నెచోడుఁడు గూఢవస్తుకావ్యరచనాప్రియుఁ

డనియు,నాతనికుమారసంభవము గూఢవస్తుమయ మనియుఁ జెప్పి తమ యిచ్చవచ్చినట్లు పిచ్చలవిడిగా నెన్నియో వింతవింత నిర్ణయములఁ జేయుచున్నారు. నన్నెచోడుఁడు తన కృతిరచనావిధానమును గూర్చి—

"సరళముగాఁగ భావములు, జాను తెనుంగున నింపుపెంపుతోఁ
చిరిగొన వర్ణనల్ ఫణితి, పేర్కొన నబము లొత్తగిల్ల బం
ధురముగఁ బ్రాణముల్ మఘనుమృదుత్వరసం బునఁ గందళింప,న
తురములు సూక్తు లార్యులకుఁ గర్ణరసాయనలీలఁ గ్రాలఁగాఁ"
(అ 1 ప 35)

అనుపద్యమున స్పష్టమొనర్చియే యున్నాఁడు. కావ్యమును గూఢపాన్ని లయము గావించి పాఠకులఁ జకితుల నొనర్చి విస్మయమూర్ఛితులఁ జేయుట యితని యుద్దేశము గాదు. ఇట్టి వానికృతియెడ లేనిపోని గూఢతలను, యుక్తిమర్మములను నారోపించుట యొకవిధముగ నాతని కపచార మొనర్చుటయే యగు ననినాయభిప్రాయము. రెడ్డిగారి విచిత్రవిమర్శము లందలి ముఖ్యాంశములఁ బరామర్శించుచు నందలి యసామంజస్యము వివరించుచు "నన్నెచోడుని కాలము" అను వ్యాసమును 1939 సంవత్సరము లోనే ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికఁ (సం. 28 సం.) లోఁ బ్రకటించి యున్నాను. నన్నెచోడుని కృతిలో గణితము,జ్యోతిషము,ఎత్తులు,జిత్తులు, యుక్తివంచనమర్మములు,ఎన్నెన్నియో గూఢగర్భితము లయియున్న వని వక్కాణించుచు రెడ్డిగారు ముఖ్యముగా నందలి—

"అన్యవాదకవితతుల నాదరించి,వెలయ సత్కవిగురుబుధబలము వడసి
యొనర దైవజ్ఞునట్ల శుభోదయమున,దివ్యసుకృతిఁబ్రతిష్ఠింతుఁ దిరము
గాఁగ" (అ1 ప 34)

(విష్ణుకాలనేముల యుద్ధఘట్టములోని) "వ॥ ఇట్లు శతముఖదశశతకర. పరిఘశోభితుండై (కాలనేమి) యనేకవివిధాయుధవర్షంబులు గురియుచుం

దెరల నెత్తివచ్చుటఁ గని శార్ఙ్గపాణియు వానికిం బ్రతిఘటించి నిలిచిన"

(ఆ 12 వ 93)

(తారకాసుర షణ్ముఖుల యుద్ధఘట్టములోని)

"కరిశిర మాడ షణ్ముఖుఁడు గైకొన వేగ్రియుడుఁ గుంభమౌక్తికో
త్కర మసిధారఁ బొల్పెసఁగెఁ దారకు భంగము సూచి నవ్వ సం
గరజయకాంత కాంతరదకాంతియొ కాదని నాటుదీటి వి
స్ఫురదవదాతఖడ్గలత పూచెనొ నా జయచైత్రసంపదన్"

(ఆ 12 వ 182).

(తారకవిజయానంతరము కుమారస్వామి తండ్రి యగుశివునికడ కేఁగి యాతనిని గౌఁగిలించికొనెడి ఘట్టము).

"ద్వాదశార్ధార్ధనయను నాద్వాదశార్ధ
వదనుఁ డొగిఁ జుట్టె నిజభుజద్వాదశమున
నుదయుదశశతకిరణుఁ డయ్యుదయనగము
గిట్టి దశశతకరములఁ జుట్టినట్లు" (ఆ 12 వ 215).

అను పద్యగద్యములకుఁ జిత్రవిచిత్రగతుల వివరణములు వ్రాసి నన్నెచోడుఁడు నన్నయభట్టునకు సమకాలీనుఁ డని విక్రమశకగతవర్షము. 1110 అను జయసంవత్సరచైత్రశుద్ధద్వితీయాజయవారమునకు సరియగు క్రీ.శ.15-3-1054 తేదీని కుమారసంభవరచనమును పూర్తిగావించె నని నిరూపించుచున్నారు.

రాజరాజనరేంద్రుఁడు నారాయణభట్టునకు నందమపూడి నగ్రహారముగా నొసంగిన శాసనము (నన్నయభట్టారకలిఖితము) శకసంవత్సరము 975 అనగా క్రీ.శ.1053 నాటిది. అందు నన్నయ భారతరచనము వాచ్యముగా నుదాహృతము కాలేదు. అందుచే నన్నయ భారతరచనారంభ మాపటుచటిసంవత్సరమున అనగా క్రీ.శ. 1054, జయసంవత్సర

మున జరిగియుండునని విమర్శకులు నిర్ణయించినారు. నన్నెచోడుని కుమార సంభవ రచనాపూర్తి సంవత్సర మని శ్రీకృష్ణారెడ్డిగారు నిర్ణయించినది కూడ నీ క్రీ.శ. 1054 వత్సరమే కదా! రెడ్డిగారినిర్ణయముప్రకారమే నన్నెచోడుఁడు నెల్లూరుమండలమున ఉదయగిరిలో రాజ్యమేలుచుఁ దన కావ్యరచన మొనర్చెను గదా! నన్నయభారతమును రచించినది గౌతమీతీరమున రాజరాజాస్థానమున రాజమహేంద్రపురమున ననుట నిర్వివాదముగ సంగీకృతమయిన సుప్రసిద్ధవిషయము. నేఁటి రేడియో లానాఁడు లేవు. ఆనాఁటి పరిస్థితులలో నన్నయ నన్నెచోడు లిరువురు నొకరికృతిని మఱియొకరు చూచి యనుకరించుటకు నడుమ తగినంత కాలవ్యవధి యుండవలె ననుట వేఱ చెప్పనక్కఱలేదు. ఇంచుమించుగ నీకృతు లొకేకాలమున వేర్వేఱుగా దూరప్రాంతముల రచింపఁబడిన వని తలంచునప్పుడు, వానిలో సాదృశ్యముగల యనుకరణములు గాన వచ్చెడిచో నవి ఘుణాక్షరన్యాయమున దైవికముగ నేర్పడిన వనితలంచి ననే తప్ప,ఒకరికృతిని మఱొకరు చదివిరనే వానినిగావించి రనిచెప్పెడి పక్షములో, నన్నయభారతము నెల్లూరుప్రాంతమునఁ బ్రచారమొందిన యనంతరమే నన్నయతర్వాత చాలకాలమునకే, తిక్కనసోమయాజి భారతమువలెనే నన్నెచోడునికృతికూడ వెలసియుండు నని చెప్పవలసి యుండును. రెడ్డిగారు తమగ్రంథమున"అనుకరణములు"అను ప్రకరణ మున నన్నెచోడునికృతినుండి, నన్నయభారతమునుండి కొన్నిపద్యముల నుదాహరించి చర్చగావించుచుఁ దుదకు "నన్నయభట్టు ఆ సత్కవివిభు నన్నెచోడుని ప్రబంధపద్యముల ననుకరింపక పోలేదు"— కరికాలకవి (నన్నెచోడుఁడు) పద్యభావములను సమకాలికులగు నన్నయభట్టాదు లును,తదనంతరకాలికు లగుసోమనాథాదులును అనుకరించియున్నారనుట కెన్నియో యుదాహరణములు కలవు" అని తమభావమును బ్రకటించి

యున్నారు. రెడ్డిగారు నన్నెచోడుని కాలనిర్ణయమున నవలంబించిన మార్గములందలి వక్రత, విచిత్రగతులమాట యెట్లున్నను, చోడకవి కృతిలోఁ గానవగు నన్నయభారతపద్యములయనుకరణ మొక్కటియే రెడ్డిగారికాలనిర్ణయము సరిగాదని పరిహరించుటకు, నన్నెచోడుఁడు నన్నయ తరువాతి వాఁడని సాధించుటకు సమర్థముగాఁగల దని నా యభిప్రాయము.

ఈవిషయము లిట్లుండ రెడ్డిగారు నన్నెచోడుని కృతియెడ నారోపించినగూఢశైవాసన క్రమముగాఁ గొందఱువిమర్శకులకుఁ గూడ మరులుగొలుపుట శోచనీయము. గురునికన్న నితఃపరము లే దన్నవృద్ధాచారవిశ్వాసముతో గురుభక్తశిఖామణి నన్నెచోడుఁడు కృత్యవతరణికలోఁ జెప్పిన "గురువున కిష్టదైవమునకుం బతికిం గృతియిచ్చి పుణ్యమున్ వరమును దేజముం బడయవచ్చు జగంబున—" అను పూర్వోక్త పద్యమునకుఁ శైవి జెప్పినవాసనాబలవ్యామోహము కారణముగాఁ దల్లడిల్లుచుఁ గొందఱాపద్యమును నేనన్వయించినరీతి గాక, విపరీతార్థము నూహించి నన్నెచోడునకు మల్లనామాంకితు లగునిష్టదైవము, గురుఁడు, ఏలిక వేర్వేఱుగ నుండి యుండవలె నని తలంచుచు నిష్టదైవము శ్రీశైల మల్లికార్జునుఁడు, గురుఁడుజంగమమల్లికార్జునుఁడు, స్పష్టముగఁదెలియ వచ్చుచున్నారు గావున మూఁడవవాఁడు మల్లనామాంకితుఁ డగుప్రభుఁ డెవఁడై యుండు నని యన్వేషణమునకుఁ దొడంగుచున్నారు. నన్నెచోడుఁడు నన్నయభట్టునకుఁ బూర్వుఁ డని నిరూపించుట కభిమతించు శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారు త్రైలోక్యమల్లశబ్దము బిరుదమే కాని వ్యక్తినామము గా దని యాక్షేపము వెలార్చుచు బెజవాడ శిలాశాసనకర్త యుద్ధమల్లుఁడు(క్రీ.శ. 900 ప్రాంతము)అను తూర్పుచాళుక్య రాజే యాప్రభుఁ డయి యుండు నని, నన్నెచోడుఁ డాతనికి సామంతుఁ

డయియుండు నని తమయభిప్రాయమును బ్రకటించిరి. ఇంద్రాది దేవతలు తారకాసురసంహారమునకై శివుఁ బ్రార్థించుట కేతెంచినపుడు సురగురుం డగుబృహస్పతిని ముం దిడికొని యాతనిముఖమున "దారిద్ర్య విద్రావణా" యనుమకుటము గలపద్యదశకముతోఁ బరమేశ్వరస్తుతి గావించినట్లు నన్నెచోడుని కుమారసంభవము దశమాశ్వాసమునం దున్నది. "దారిద్ర్యదుఃఖదహనాయ నమశ్శివాయ" అనుమకుటముతో శ్లోకదశక ముగల వసిష్ఠమహర్షి కృతశివస్తవ మొకటి యనుశ్రుతముగ బహుకాలమునుండీ భక్తలోకమునఁ బఠనపాఠములం దున్నది. దానిని మనమం దిడికొని నన్నెచోడుఁడు తానంతకుమున్న బాల్యమున దారిద్ర్యవిద్రావణా యనుమకుటముగల శివస్తవ మొకటి కూర్చియుండు ననియు, అది శాశ్వతముగా నిల్చియుండుటకయి దానినే కథాసందర్భానుకూలముగ గీష్పతిగావించినశివస్తుతిగా నీకావ్యమునఁ జొనిపియుండు ననియుఁ బలువురు విజ్ఞులు తలంచుచున్నారు.

ఇందలి "మనమారంగఁ ద్రుటిమాత్రంబయిననిన్ మర్త్యుండు భావించి" "కారుణ్యాత్మకు నిన్నమానవుఁ డెదంగావించి" "భక్తిపరులై దారిద్ర్యవిద్రావణ స్తవ మర్థింబఠియించు మానవులకున్" అనుపద్యములలోని మర్త్యమానవశబ్దోదాహరణము లీ యూహకు స్ఫోరకములు కాఁగలవు. కేవలము దేవకార్యార్థమై యేఁగినపుడు సురగురుఁడు పరమేశ్వరు స్తుతించు ప్రత్యేకసందర్భమునకే రచితమయినచో నిట్టి విశేషణములు ఫలశ్రుతులు నందుఁ జెప్పఁబడకయే యుండును.

ఈ పద్యములలోని మొదటిపద్యమిది- "శ్రీరామేశగవీశ్వరాదులెద నీశ్రీపాదముల్ భక్తితో నారాధించి సమస్తలోక సముదాయాధీశులై రన్న, సంసారుల్ దుఃఖనివారణార్థ మభవున్ సర్వేశు లోకత్రయాధారున్ నిన్ మదిఁ గొల్వకునిక్కి యుజవే దారిద్ర్యవిద్రావణా"-

ఇందు మొదటిపాదమందలి శ్రీరామేశగవీశ్వరపదములకు సరసముగా సమంజసముగా శ్రీరామేశ = లక్ష్మీశ = విష్ణువు, గవీశ్వర = వాగీశ = బ్రహ్మ అని కీ॥ శే॥ శ్రీపాదలక్ష్మీపతిశాస్త్రిగారు వివరణము తెలిపినారు. శివారాధన మొనర్చి శివానుగ్రహమున నే విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుఁడు మున్నగు దేవతలు తమతమపదవులఁ బడసినట్లు శైవపురాణ ప్రసిద్ధము. పశ్చిమచాళుక్యులలో, కాకతీయులలోఁ గొందఱు రాజులకు త్రైలోక్యమల్ల, త్రిభువనమల్ల, ఆహవమల్ల బిరుదము లున్నట్లు చరిత్రవలనఁ దెలియనగును. తెలంగాణాశాసనములలో అనుమకొండ, ఖాజీపేట దర్గాశాసనములో శ్రీపర్వతప్రసిద్ధమల్లికార్జున శిలామఠాచార్యుఁ డగు రామేశ్వరపండితునకుఁ దనపూర్వు లొసంగినదానముల నుద్ధరించుచు "చలమర్తిగండ దారిద్ర్యవిద్రావణ" బిరుదాంకితుఁ డగు కాకతిత్రిభువనమల్లదుర్గరాజు శాసనస్తంభమును నెలకొల్పిన ట్లున్నది. ఇందు దుర్గరాజునకు దారిద్ర్యవిద్రావణబిరుద ముండుటచేతను, అతఁడు క్రీ॥ శ॥ 1100 ప్రాంతమునఁ బరిపాలించి యుండుటవలనను నన్నెచోడుఁడు తనదారిద్ర్యవిద్రావణస్తవములో వీరిని మనమం దిడికొని వ్యంగ్యముగ సూచించియుండు ననిభావించుచు, మదరాసు విశ్వవిద్యాలయుపత్త్రమునఁ దమపరిష్కరణముతో 1948 సంవత్సరమునఁ బ్రకటించిన కుమారసంభవపీఠికలో శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు క్రిందివాక్యములు లిఖించిరి.

"ఈ (క్రీ॥ శ॥ 1100) ప్రాంతములనే శ్రీశైలమందలి మల్లికార్జునయోగి, అతనిశిష్యుఁడు పండితుఁడుగానున్న రామేశ్వరకవి దారిద్ర్యవిద్రావణబిరుదు గలప్రభువు నొకచో ఖాజీపేట శిలాశాసనమునఁ గూడియుండుటచేత తనకుమారసంభవమున నన్నెచోడుఁడు వీరిని గూర్చి చేసినసూచనలు అతఁ డీ కాలపువాఁడే యై యుండుననుట

ప్రభువపఱచుచున్నవి వలెనే యున్నవి. ఇంచుమించు సమకాలములో వీముగ్గురను సమకూర్చు శాసననిదర్శన మిదీ.''

ఆ కాలమున శ్రీశైలమున మల్లికార్జునయోగియు నాతనియొద్ద పండితుఁడుగా రామేశకవి యుండినట్లు శ్రీ రామకృష్ణయ్యగారు వ్రాసిన నది పొరపాటు. శ్రీ పర్వత మల్లికార్జున శిలామఠమున కాచార్యుఁడుగా నున్న రామేశ్వరపండితునకు దాన మొసంగఁబడినట్లుమాత్రమే శాసనమం దున్నది. దారిద్ర్యవిద్రావణబిరుదాంకితుఁడు కాకతిదుర్గరాజు కాలము తామేర్పఱచిన నన్నెచోడుని కుమారసంభవరచనాకాలమునకు సంగతముగాలేనందున శ్రీ కృష్ణారెడ్డిగారీవిషయమున నొకవిధముగఁ దాటస్థ్యము వహించి, తమ నన్నెచోడకవిచరిత్రగ్రంథములో "దారిద్ర్యవిద్రావణులు" అను ప్రకరణముఁ జాలవఱకుఁ జర్చించియుఁ జివర క్రిందివాక్యములు లిఖించిరి. "ఇంతకు కవి,కృతిపతులు నలుగురిని అభేదరూపకముగా "దారిద్ర్యవిద్రావణా" అని సంబోధించియున్నాఁడు కాన, కవికాలమునాఁటి కది యొకవంశబిరుదము గాదు. పిమ్మట ఇది కాకతీయవంశబిరుదముగా స్థిరపడిన దనియు, శ్రీరామేశగ(క)విశ్వారాధ్యులన్న కవికాలమునాటి రామేశ.కవి కాలాముఖశైవుఁడగునో కాదో స్పష్టముగా తెలియ దనియు. శ్రీ పర్వతప్రసిద్ధమల్లికార్జునశిలామఠము శ్రీశైలమల్లికార్జునస్వామిపేరిటి కాలాముఖమఠమే కాని శ్రీశైలమల్లికార్జునయోగిపేరిటి కాలాముఖమఠము కా దనియు చెప్పుట కవకాశ మున్నది.''

ఇట్టిశాసనములనుబట్టి యెవరికిఁ దోచినట్టు వారు నిర్ణయములు కావించుకొనుట శోచనీయము. రెడ్డిగారిగ్రంథమునకు తొలిపలుకు వ్రాసిన శ్రీ నేలటూరు వేంకటరమణయ్యగారు గూడ నిందుగూర్చి కొంత చర్చించి తుదకు "ఈశాసనము నెవ్వరి కనుకూలమైనవిధమున వా రర్థము చేసికొనియున్నారు. వేంకటకృష్ణారెడ్డిగారి విమర్శ గమ-

నింపఁదగినది" అని లిఖించిరి. నన్నెచోడునికి మల్లనామాంకితుఁ డగు
ప్రభుఁ డొకఁడుండినచో నాతఁడు యుద్ధమల్లుఁడై యుండు నని
వేంకటరమణయ్యగారు నన్నెచోడుఁడు నన్నయకుఁ బూర్వుఁ డనుసి
వాదమున కనుకూలముగాఁ దలంచుచున్నా రని యింతకుముందే చెప్పి
యుంటిని.

ఇంతకు నివి యన్నియు, అత్యూహ లనియు, నన్నెచోడుని
కావ్యమును గూఢవస్తుమయముగాఁ దలంచుదుర్భ్రమవలనఁ గలిగిన
దుష్ఫలితములు మాత్రమే యనియు నావిశ్వాసము. నన్నెచోడుని
దారిద్ర్యవిద్రావణ స్తవములోని మొదటిపద్యములో శ్రీరామేశగ
శ్వరాములు (విష్ణుబ్రహ్మాద్యమరులు) శివచరణారవిందముల నెడందలో
నిలిపి యారాధించి తాము సమస్తలోకసముదాయాధీశు లయి రని
స్పష్టముగా నున్నది. మర్త్యుఁ డగురామేశకవి కీర్తిపదప్రాప్తి యేమియు
లేదు గదా. అట్టియెడఁ గవిమూలపాఠమందలి గవిశబ్దములోని సరళా
క్షరమును బరుషాక్షరముగాఁ బఠించి క్రీ. శ. 1100 ప్రాంతమునాఁటి
రామేశకవి కిందుఁ బ్రసక్తి కలిగించుట హాస్యాస్పదము. ఇట్టిపట్టులలోఁ
గవి,శబ్దములలో శ్లేషగాని, వ్యంగ్యము గాని, ధ్వనిగాని యుద్దేశించి
నప్పుడు, ఆతఁడు చెప్పఁబోవుపదార్థ ముభయత్ర సరిపడునట్టిదిగా
నుండవలెను. అట్లుగాక యారక వెఱ్ఱివానిచేతిఱాలవలె శబ్దముల నుప
యోగించినచో గూఢత, ప్రౌఢతలకు మాఱు మూఢత యనివార్య
ముగా నాతని కంటఁగట్టవలసివచ్చును. సరళభావములతోఁ గావ్యరచన
సాగింతు నని ప్రతినచేసినకవిరాజశిఖామణి కిట్టిమూఢత ఘటించుట
యపచారముగాక మఱేమగును? నన్నెచోడునిదృష్టిలో, కాలములో
రామేశకవి యనునతఁ డొక్కఁడు లేనేలేఁడు. మృత్యుదేవతాముఖగహ్వ
రనిద్రాణులగుభూజానులు బిరుదములు తగిలించుకొన్నంతమాత్రమున
దారిద్ర్యవిద్రావణులు కానేరరు. "మెఱుఁగుఁ గోరలు దుల్ల మృత్యు

దేవతనోరు ధట్టించి యరగాలఁదన్నిన" ధట్టుఁడు గట్టువిల్కాఁ డొక్కఁడే నన్నెచోడునిదృష్టిలో నిక్కమయినదారిద్ర్య విద్రావణుఁడు "దారిద్ర్యదుఃఖదహనాయ నమశ్శివాయ" యను ప్రాచీనమహర్షి కృత స్తుతియే యాతనిదారిద్ర్యవిద్రావణస్తవపద్యదశకరచనమున కుద్బోధకము-అతనిపద్యమందలి "సంసారులదుఃఖనివారణార్థ" మను పదముల లోని 'దుఃఖ' శబ్దముగూడ నిందుకు స్ఫోరకము. తనగురుఁడు వృద్ధాచారుఁడై విద్వత్ప్రీతి గావించిన మహాత్ముఁ డని 'అమలజ్ఞానసుదీపవర్తి గొని వృద్ధాచారుఁడై' యను పూర్వోక్తపద్యమున నన్నెచోడుఁడు ప్రశంసించినాఁడు. గురుని కనురూపుఁ డయినశిష్యుఁ డయి వృద్ధాచారానుగుణముగ, గురునికన్న భిన్నమగుతత్త్వము మఱొండు లే దనెడు సనాతనోక్తియందు దృఢభక్తివిశ్వాసములుగల గురుభక్తశిఖామణి తా నగుటవలనఁ దనపాలిటి యిష్టదైవము, గురువు, ప్రభువు నగుగురు నకుఁ దనకృతి సంకితి మొనంగుటవలన, ఇష్టదేవములకు, గురులకు, నిజాశ్రయు లగురాజులకు వేర్వేఱుగఁ దమకృతుల నిచ్చియితరకవులు వడయు పుణ్యము, వరము, తేజము మున్నగులాభము లన్నియునొక్కటనే సమకూడఁ దనకు ధన్యత్వమును గూర్చిన వనుభావముతోనే నన్నెచోడుఁడు గ్రంథావతారికలో "శరధినీరులు పయోధరములు గొనివచ్చి కురిసి వారిధియందుఁ గూర్చునట్లు ........."అను పద్యమును జెప్పి దానివెనువెంటనే "గురువున కిష్టదైవమునకుం బతికిం గృతి చెప్పి..." అనుపద్యమును లిఖించినాఁడు. ఇంతకన్న భిన్న మగునాశయ మామహాశయున కావంతయు లే దనియే నాదృఢవిశ్వాసము. ఇదియే కవిరాజశిఖామణి, గురుభక్తశిఖామణియు నగునాసుకృతివర్యుని గురుస్తుతితత్త్వము. ఆపుణ్యపురుషుని మార్గమునే యాదర్శముగాఁ గొని భారతీయవృద్ధాచారానుసరణి గురుభక్తితత్పరు లయి యెల్లరు పరమేశ్వ కారుణ్యమునకుఁ బాత్రులయి వర్ధిల్లెదరు గాక యని ప్రార్థించుచున్నాను.

ఓం తత్సత్.

---

# పోతన

వేలూరిపాటి రామభద్ర చయనులు.

ఈతడు పోతరాజు అని కూడ పిలువబడువాడు "పోతరాజొకడు బ్రాసె జగద్ధితంబుగన్" ఈ రాజు శబ్దము చివరవరకు గ్రామమున నాతనికి పోతరాజు గారని పిలుపులో నిలిచి యుండవచ్చును. గ్రామ దేవతాలయముల ముంగిట పోతురాజు లుందురు. వీరును దేవతలే. అమ్మవారలకు వీరు సోదరులు. వీరే పోతు పేరటాండ్రు. పోతు శబ్దము అందముతగ్గిన "పోత" అయినదేమో? "అన పోత" ఇత్యాదులు. ఈతడు భోగినీదండకము నాటికి "పండిత కీర్తనీయుడగు బమ్మెర పోతన"గ నున్నాడు భాగవతము "పోతనామాత్యుని"గ వాడింపబడి. ఈతనిది శైవవంశము. దాక్షాయణీ పరిణయములో.

సీ. శ్రీరామ లింగాంఘ్రి ... ... ...

ఇవటూరి ముక్తినా, గేశ సద్గురుభక్తి నాదిమశైవు లైనట్టివారి అనియు, వీరభద్ర విజయములో

ఆ. లలితమూర్తి బహుకళానిధి కేసనదాసనూననీతిధనుఁడు ఘనుఁడు దనకులక్కమాంబ ధర్మగేహినిగాఁగ మనియె శైవశాస్త్రమతముగనియె.

అనియు చెప్పికొనినారు. వీరభద్ర విజయమును జెప్పినాటి కాతనియింట శైవము హెచ్చుగా నున్నట్లు "భూసుర వంశ్యుని, స్సుగుణభూషణు నాశ్రిత కల్పవృక్షముఁ దానజనప్రసన్ను, శివతత్త్వ మనోరథ జ్ఞాతుఁ గొన్నతుఁ గేసనమంత్రి సత్యనిధిఁ గీర్తివిశాలఁ జిరాయు రున్నతుఁ" జేసియుమామహేశ్వరులు చెన్నుగఁ గాతురు శాకసత్కృపవ "గురుని దివ్యపాదపద్మ" అని గురుతనిలిపియే యున్నారు—వయసు గడచి సంస్కృతులను బరిశీలనము చేసి చూచినకొలది "శుద్ధాద్వైతిగ మారినాడు".

"చేతులారంగ శివుని బూజింపడేని, నోరునొవ్వంగ హరికీర్తినుడువడేని" హరిని హరుని చేయవచ్చును. మొత్తము మీఁద భావమంతయు మారినదా లేదాఁ అనుట కావలెను. "దేనిని వర్ణింపబూనినను పరమాత్మగ వర్ణింప గడగుట పరమాద్వైతము. అట్లుకాక వర్ణితవస్తువు నుద్దిష్ట దైవముగ మార్చుట కుద్వైతము - భాగవతభాగపూరణమున జేతులజొనిపిన యితరకవుల విశిష్టాద్వైతప్రవిష్టత, యితని రచనలో గన్పించక సర్వమతసమత్వము గన్పించుచున్నది.

శివాయ విష్ణురూపాయ, శివరూపాయ విష్ణవే.

చేసినవాఁడొకచోట సమతనుజూపుచు ఇట విష్ణువు బాలకృష్ణుడుగ దొరకినాడు పోతనగారికి. వెనుకటి శైవము మనికి దోచినదికానోపు. ఆమహామహునకు—

సీ॥ తనువున నంటిన ధరణీపరాగంబు పూసిన నెఱిభూతిపూఁతగాఁగ
ముందఱ వెలుఁగొందుముక్తాలలామంబు తొగలసంగతికానితునుకగాఁగ
ఫాలభాగంబుపై బరగు కావిరిబొట్టు కాముని గెల్చినకన్నుగాఁగ
గంఠమాలికలోని ఘననీలరత్నంబు కమనీయమగు మెడకప్పుగాఁగ
హారవల్లు లురగహారవల్లులు గాఁగ, బాలలీలఁ బ్రౌఢబాలకుండు
శివునిపగిది నొప్పె శివునికి దనకును, వేఱులేమిఁదెల్ప వెలయునట్లు.

"భాగవతప్రబంధ మతిభాసురతన్రచియించి" ఈపద్యముప్రాచీన తాళపత్రగ్రంథముల గన్పింపదు. గురుపాదపద్మభక్తివశత, నాతని ప్రేరణమున ముందువెనుక లారయనీయని టుందుడుకుకవిత్వము వీరభద్రవిజయముది. "అప్పటి కాతడు పోతయ. భాగవతమునాటికి పోతనామాత్యుడు. శకటరేఫ నిర్ణయమునాటికి భారతము లక్ష్మీశ్రపతిగ నుండిన యాతడు భారతవ్యాఖ్యానమునాటికి లక్ష్మీశ్రపతిసోమయాజిగ మారినాడు. తిక్కన సోమయాజి కాగనే యజ్వ అయినాడు. వీరభద్ర

విజయము పోతనది కాదని కొందరూహించిన దాని కర్తవి వంశవృక్ష మడ్డు తగులుచున్నది.

| వీరభద్రవిజయము. | భాగవతము. |
| --- | --- |
| భీమన | భీమన |
| అన్నయ | అన్నయ |
| సోమన | సోమన |
| ఎల్లన | ఎల్లన |
| కేసన (లక్ష్మమ్మ) | కేసన (లక్కాంబ) |
| పోతయ | పోతన |

పోతన వీరభద్రవిజయమున దనవంశము వారినందరను చెప్పినాడు. భాగవతమున వదలినాడు. కవిస్తుతి రెంటనుఁ గొలది భేదము గలిగియు, సమముగనే యున్నది. భాగవతబీజములు వీరభద్రవిజయములో లేకపోలేదు.

సీ. వీణియ నీవు దే వీణావినోదిని, మృగనాభి నీవు దే మృగనిభాక్షి
రాజహంసిక తెమ్మ రాజహంసికయాన, కీరంబునీవు దే కీరవాణి
మణిహారములు దెమ్మ మణిగణాలంకృత, పువ్వులు నీవు దే పువ్వుఁబోణి
గంధంబు నీవు దే గంధసింధురయాన, కనకంబు నీవు దే కనకవర్ణ
పాలతియాడుపస్డిబొమ్మలునీవు దే, పసిడిబొమ్మబోలు పణతిమతియు
వలయునట్టిపెక్కువస్తువుల్ గొనిరండు, గౌరి వెంటమనము గదలవలయు.

వీ-వి. ఆ ౧ ప ౧౩౬.

సీ. తిలక మేటికి లేదు తిలకినీతిలకమ, పువ్వులు తుఱుమవా పువ్వుఁబోఁడి
కస్తూరియలఁదవా కస్తూరికాగంధి, తొడవులుఁ దొడవవా తొడవుతొడవ
కలహంసఁ బెంపుదే కలహంసగామిని, కీరముఁ జదివింతె కీరవాణి

లతలఁ బోషింతువా లతికాలలితదేహ, సరసినోలాడుదే సరసిజాక్షి
మృగికి మేత లిడుదె మృగశాబలోచన, గురుల నాదరింతె గురువివేక
బంధుజనులఁ బ్రోతె బంధుచింతామణి, యనుచు సతులనడిగె నచ్యుతుండు.

భా ౧ స్కం ౨౬ ప,

సీ. కమలాక్షి యితఁడెకళ్యాణవర్తియై, సమ్మోదమునవచ్చు జాణమగడు
కామిని యితఁడె ఘనజటావళిలోన, మిన్నేఱు దాఁచినమిండగీఁడు
వనితరో యితఁడె మనగౌరినలరింప, పుప్వగాఁ దుఱిమినపుట్టుభోగి
మగువరో యితఁడె మనగౌరిలనరింప, మాయపువటువైన మాయలాఁడు
ఉత్తమాంగి యితఁడె విత్తేశుచెలికాఁడు, విమలనేత్రి యితఁడె వేల్పుతేఁడు
ఇందువదన యితఁడె, మందిరకైలాస, కందరుండు నీలకంధరుండు.

హ-వి. ఆ 3 ప ౧౩౩.

సీ. వీడటే రక్కసి విగతజీవగఁ జన్నుఁ, బాలుద్రావిన మేటిబాలకుండు
వీడటే నందుని వెలదికిజగమెల్ల, ముఖమందుఁజూపిన ముద్దులాఁడు
వీడటే మందలో వెన్నలు దొంగిలి, దర్పించి మెక్కిన దాఁపరీఁడు.
వీడటే యలయించి వ్రేతలమానంబు, చూఱలాడిన లోకసుందరుండు
వీఁడు లేకున్న పుర మటవీస్థలంబు, వీనిఁబొందని జన్మంబు విగతఫలము
వీనిఁబలుకని వచనంబు విహగరుతము, వీనిఁజూడని చూడ్కులు వృథలు వృథలు.

భాగ. ౧౦ స్కం. పూ. ప. ౧౨౭౮.

ఇంతకన్న సన్నిహితమన్న పద్యములు—

సీ. శృంగారములు చేయుశృంగారమొల్లదు, పూవులుదురుమదు పువ్వుఁబోఁడి
పలికింపనేరదు పలుకనేరదుఁ బ్రాంతి, చంచలత్వము గాంచుఁ జంచలాక్షి
సరసులక్రీడింప సరసిజాననపోదు, మానంబు లోగుందు మానవిభవ
గంధంబు పూయదు గంధవారణయాన, చెలియలపిలువదు చెలులచెలియ

ముకుర మొప్పగఁజూడదు ముకురయాన, తరుణిమణియును సర్వకృత్య
ములుమఱచి
వారునితోడుతఁగొంచాటమైలతాంగి, యుగ్రతపమును సైరింపకున్నఁ
జూచి. (పి.వి.)

సీ. మృగనాభియలదదు మృగరాజమధ్యము, జలములనాడదు జలజగంధి
ముకురంబుఁజూడదు ముకురసన్నిభముఖి, పువ్వులుదురుమదు పువ్వుఁబోఁడి
వనకేళిఁగోరదు వనజాతలోచన, హంసంబుఁబెంపదు హంసగమన
లతలఁబోషింపదు లతికాలలితదేహ, తొడవులుదొడవదు తొడవుతొడవు
తిలకమిడదు నుదుటతిలకేతి తిలకంబు, గమలగృహముచొరదు కమలహస్త
గారవించితన్నుఁ గరుణఁగైకొనవన, మాలిరాఁడు జాలిమాలియనుచు.

భా. దశ. పూ.

శివునివైపు జనవల దని రతి మన్మథునితోఁ జెప్పినమాటలు—

చ. అతని శరాసనంబు కనకాచల మిక్షుశరాసనంబు ని
కతనికి నమ్ము పాశుపత మంటిన గందెపుపువ్వు లమ్ము నీ
కతడు పురాపహారి విరహాతురపాంథజనాపహారి నీ
వతనికి నీకు హస్తిమశకాంతర మెమ్మెయి నెన్నఁ జూచినన్.

(నన్నెచోడ కుమార)

సీ. భూకాంత తేరును బువ్వుల తేరును, నిర్జరభటులును నీరభటులు
కనకాచలము విల్లు కడుదియ్యవగువిల్లు, మేటినందిపడగ మీనుపడగ
బహుమంత్రివాజులు పచ్చనివాజులు, పెక్కుతేలలవారి భృంగనారి
నలుమొగంబులసూతి నవవసంతుఁడుసూతి, పురుషోత్తముండమ్ము
పూవులమ్ము
వెలయ రేయుఁబగలు వెలిగెడు కన్నులు, తమ్మికండ్లుఁ, త్రిపురదైత్యకోటి
గురి విటవ్రజంబు గురి యతనికినీకు, నేమిచెప్పవచ్చు నంతకంత.

పి-వి. ఆ ౨ ప ౨౧

వీరభద్రవిజయకవిత వ్యాకృతి, సంధి, ఛందో, దోషకవిత యతిభంగ
మునుగూడ నడపినది. భాగవతరచనమున గూడగొన్ని దోషములిట్టివి లేక
పోలేదు. భాగవతమునగూడ రాధికతి నశించినజాడలున్నవి. వర్ణనమున
బారపడిన పోతనకు కీచురాయి (ఝిల్లీ)కూడ పెద్దజంతువుగ గన్పించును

దనుజ భుజగ యక్షదైత్యమృగాధీరసుందరీవిహంగశూద్ర
శబరులైన— ఇందలి యన్నిపదములు నాతని వగునో కావో! పద్మ
పురాణముననున్న దనుకొనిన సత్యభామానరకయుద్ధము నిందు ప్రవేశ
పెట్టి వర్ణనకు దారకొనినాడు.

మ॥ పరుఁజూచుఁ వరుజూచు నొంప నలరింపన్ రోషరాగోదయా
విరతభ్రూకుటిమందహాసములతో వీరంబు శృంగారముఁ ।
జరగఁ గన్నుల కెంపుసొంపు బరగఁ జంద్రాస్త్ర సందోహముఁ
సరసాలోకసమూహముఁ నెఱపుచుఁ జంద్రాస్య హేలాగతిఁ.

భా. దశ. ఉత్తర.

సీ॥ వీణెఁ జక్కఁగఁ బట్ట వెరవెఱుంగనిలేమ బాణాసనం బెట్లుపట్టనేర్చె
మ్రాకునదీగ కూర్పంగ నేరనిశ్రమ గుణము నేక్రియ ధనుఃకోటిఁ గూర్చె
పరవిముత్యముఁ గ్రువ్వ జాలనియబల యేనిపుణత సంధించె నిశితశరము
జిలుకకుఁ బద్యంబుఁ జెప్ప నేరనితన్వి యస్త్రమంత్రము లెన్నఁ డభ్యసించె
బలుకు మనినఁ బెక్కుపలుకని ముగుద యే, గతి నొనర్చె సింహగర్జనములు
వనఁగ మెఱసె త్రిజగదభిరామగుణధామ, చారుసత్యభామ సత్యభామ.

భా. దశ. ఉత్తర.

సీ॥ రాకేందుబింబమై రవిబింబమై యొప్పు, నీరజాతేక్షణ నెమ్మొగంబు
కందర్పకేతువై ఘనధూమకేతువై యలరుఁ బూఁబోఁడి చేలాంచలంబు
భావజుపరిధియై ప్రళయార్కపరిధియై మెఱయు నాకృష్టమై మెలఁత చాప
మమృతప్రవాహమై యనలసందోహమై తనరారు సంతతసందర్శనంబు
హర్షదాయియై మహాకోపదాయియై, పరగు ముద్దరాలి బాణవృష్టి
హరికి మఱియు నరికి నందందు శృంగార, వీరరసము లోలి విస్తరిల్ల.

మూలమున లేని గోపికలగోడును యశోదకడ జెప్పించినాడు సభ్యతా శూన్యముగ "సకుమారక మాకోదీః, మణిశ్యేషశ్శ్యమంతకః" యని "మూలమునను బలుపురాణములను నున్న జాంబవంతునుయ్యాలలోని బాలుడు పోతనామాత్యుల దృష్టిలో బాలిక యయినది. శృంగారరస వర్ణన మనిన నీతనికి నల్లేరుపై బండినడకయే. భాగవతమున తీన ముద్దు ముచ్చటలదీర్చికొని మురియును. భాగవతము చేరికకల భోగినీదండకమునకు వీరభద్రవిజయమును బోల్చుట కనువుపడదు. భాగవతము నాటికి కాగినపాలు చల్లార్చుకొనినాడు పోతనామాత్యుడు.

శా॥ ఏరా! దక్షా! యదక్షమానస! వృథా యీదూషణం బేలరా!
దోరీ! పాపము లెల్లఁ బో విడువరా! యుగ్రాక్షుఁ జేపట్టరా
వైరం బొప్పదురా! శివుం దలఁపరా! వర్ణింపరా! రాజితో
జ్కారాత్ముండగు నీలకంఠుఁ దెగడం గారాదురా! దుర్మతీ!

మృదువగు భాగవతములోని మందలింపును వినుడు—

ఉ॥ నీలగళాపరాధియగు నీకుఁ దనూభవనేట చాలదా
చాలు గుమర్త్య నీదుతనుజాత ననన్ మది సిగ్గు పుట్టదే
ఏల ధర న్మహాత్ములకు నెగ్గొనరించెడివారిజన్మముల్
గాలువనే! తలంప జనకా! కుటిలాత్మక! యెన్నిచూకగన్.

కుమారసంభవపు సమకృతి జూడుడు. అరుంధతితో శివుఁడిట్లు చెప్పెను.

మ॥ వనితా! కూతుల పెండ్లి సేయునెడలన్ వాచాలకల్ తల్లులే
యని లోకంబులు పల్కుఁగాన సతి! నీ వద్రీశునిల్లాలితోఁ
నొనరం గన్నియకు న్వరుండు దగు మీ రూహింపఁగానేల యి
ట్లని కార్యంబు ఘటింపఁగా బలుకుమీ యంభోజపత్రేక్షణా.

పీ: వి. ఆ. 3—వ ప.

దీనికి మూలము

ఆర్యా ప్యరుంధతీ తత్ర వ్యాపారం కర్తు మర్హతి
ప్రాయే ణైవం విధేకార్యే పురంధ్రీణాం ప్రగల్భతా.

కుమారసంభవ ౬ స. 37 శ్లో.

వీరభద్రవిజయకవిత పసి దని చెప్పియున్నాను. ఆమె మాటలు బాగుగ నేర్వలేదు. ఒయ్యారము దిద్దుపాటులేనిది. అర్థార్జన మెఱుఁగదు. భావో దాత్త పొంతబోదు. అలంకారప్రియ కాదు. సహజసౌందర్యమాత్ర విజితలోక - కొన్ని పదము లనన్వితములు.

అనన్వయోదాహరణము

మత్త. శ్రీలలాటముసంఘటించిన చేతులా యవి నాతి నీ
లాలకల్ మదభృంగముల్ నయనాంబకల్పలు జక్క్రవల్
పాలయిండ్లు మరాళముల్ దగభక్తినీరుకడల్ దగఁ
గాలిగా గలకంఠి నిల్చె కొలంకుభంగి దలంచుచున్.

వీ. వి. ౧ ప. ౧౧౮.

ఛందోదోషములు :— యతిభంగము,

ముకురంబునందును మృదువు లేదు.
కులశైలగుహాలు ఘూర్ణిల్లి చెలఁగ.

గణభంగము :

తే. భూతి నుదుటను త్రిపుండ్రమొప్ప. న్న గురువుకాదు.

శా॥ కాలాంభోధరకాంతి మెచ్చక భుజంగశృంగ సంకాశమై
'గ' - గురువు కానేరదు కదా!

వ్యాకృతిదోషములు — పదదోషములు :

బ్రాహ్మణు లుత్తమ బ్రాహ్మ దనగ
దీర్ఘాయుసంతుష్టు గా
చిరాయుసంపదుఁ

వైవస్వతమన్వువాడు
కుండలీలో కవు
సమసార నివాసుని జేయకున్నచో (సంసార)
సమసారపు దుఃఖము లేనివాఁడ ( ... )

సంధిగతదోషములు :

1. నమో నమో నమ సుధాసంకాశితాంగాయ
2. సర్వయుపాయనములందు భావజ్ఞా.

కర్తృపదము బహువచనము,క్రియాపద మేకవచనము.

బ్రిహ్మలు వేల్పులు పరగ చచ్చె

కువర్ణకంబునకు ముందు నగాగమంబు లేకుండుట

జలజాననుకై వక్ర
మహేశు కిట్ల నెక.
సంస్కృత పదములను దెలుఁగు పదములతో సమసింపజేయుట.
1. వెన్నెలధరుమీద.
2. కొన్నెలధరుపేర.
3. పరమవంటికాడు.
4. సప్తసంద్రిములు.
విశేషణమును విశేష్యముగ నుపయోగించుట.
1. శోకాతురమున గన్నియ పలికె (ఆతురత్వము).
2. మంగళపవిద చెుందక (మంగళ పవిదత్వము).
దురితమున కచ్చు పర మగునపుడు ద్విత్వము.
1. తామరసాక్షుడు న్నతని తత్త్వము.
2. కడు తేర్తు న్నని.
ఇట్లు భాగవతమున గూడ నున్నవి.

ప్రీతిగాఁ వింటి నన్నముఁగొంటి నీగృహమునన్. భాగ 2 స్కం. భాగవతములో యతిభంగము, గణభంగము.

వ్యాకరణ విరుద్ధ ప్రయోగములు. చాల కలిగినను మార్చి సవరించు పరిష్కర్త లుపకరించుచు వచ్చిరి.

ధూర్జటి అంతా అని ప్రయోగించగ తిరుపతి వేంకటకవులు నిందా నెత్తిపై నెక్క అని వ్రాసిరి.

రాకన్ మానవు, పోకన్ మానదు మొదలయినవి పలురకములు భాగవతములో లేకపోలేదు. తిక్కన యొద్ద నిలబడుటకైనను చాలని యలాత్మణికు డని పోతన యాక్షేపింపబడినవాడైనను—

"త్రిజగన్మోహన"

ఇత్యాది స్థలముల భక్తిపరవశుడైన భీష్ముడుగా మారినాడు. పోతన తిక్కనగారి తీర్పువలన తిక్కనయే యైనాడు.

పోతన గారి తీర్పు జనుల పారవశ్యుల చేయునేర్పు కలది. భక్తి మైమరుపునొందించి పెడదోవల ద్రొక్కించినను కలమును పట్టినది మొదలు దింపువరకు మురిపెము నొలికించు నడకతీరున భాగవతమును నడపినాడు పోతన. నారాయణశతక మాతనిది కాదని పలువురు పెద్దలభిప్రాయ పడిరి. మిగిలిన పద్యకావ్యముల రెంటను పోతన సహజపాండితీ ధురంధరతను నెరిపినమాట నిజము.

పోతనామాత్యునకు శ్రీ దర్శనమున ముందుకు జోలుచుకొని వచ్చు వానిమీఁద నే, ముందు జూపుఉుకును. ముఖమును దరువాత చూడవచ్చును - కప్పబడు నేమో యివి యనుకొనును కానోపు.

కాటుకకంటినీరు చనుకట్టుపయిం బడ—అని సరస్వతి యేడువగ నాచేత కాదా యని యత్తగారగు రుక్మిణీమాపలత్నమ్మ

"కాటుక నెఱయంగ గన్నీరు వరదలై"

కుచకుంభయుగళకుంకుమము దడియు" యేడ్చును—వైరాగ్య వర్ణనమున దిక్కనగారికి దీసిపోవు వాడైనచో భాగవతములోని చాల భాగములు స్పృశింపకయే విడిచియుండవలెను. కాదు కాదు భాగవత మాడదు కూడను.

నీతోబాటు మమ్ములను ధన్యులనుజేసిన మహాకవీ! నీయాత్మకివే జోహారులు.

---

# పినవీరభద్రుని శృంగారశాకుంతలము

## కావ్యోత్కర్ష - విశ్వనాథకవిశేఖరులు.

పురాణప్రబంధయుగముల మధ్యకాలమున శ్రీనాథకవిసార్వభౌముఁడు కావ్యరచన మొనరించియుండుటయు నతని సమకాలికుఁడైన పిల్లలమఱ్ఱి పినవీరనకూడ నాకాలమునందే కావ్యరచన మొనరించె ననియు విశద మగువిషయములు. సంధికాలములో జీవించి సత్కావ్యముల నంతరించిన యీకవు లిరువురును పురాణప్రబంధలక్షణముల రెండింటిని దమకృతులలో వెలయించిరి. అందుఁ గాలప్రాబల్యమునఁగానోపు పినవీరభద్రుఁడు సంస్కృతమున దృశ్యకావ్యముగా మహాకవి కాళిదాసు రచించినకథాభాగంబును నాటకముగా వ్రాయఁబూనుకొనక శ్రవ్యకావ్యముగనే వ్రాసినాఁడు. 'కావ్యేషు నాటకం రమ్యమ్' అను నార్యోక్తి సుప్రసిద్ధమైనను ఆంధ్రవాఙ్మయమున నప్పుడు నాటకప్రవృత్తియే లేదని తెలియుచున్నది.

పినవీరన శృంగారశాకుంతలమున కథాభాగము

ప్రఖ్యాతం బన మిశ్రబంధ మన నుత్పాద్యం బనంగాఁ ద్రిధా
వ్యాఖ్యాతం బగువస్తువందు మతి యధ్యాహారముం జేయఁగాఁ
బ్రఖ్యాతం బితివృత్తమైన కృతిచెప్పన్ వక్తకున్ శ్రోతకున్
విఖ్యాతిం గలిగించుఁ బుణ్యమహిమ న్విశ్వంభరామండలిన్."

అనుచొప్పున మిక్కిలి సుప్రసిద్ధమై భారతమునందును కాళిదాసకృతి యగు నభిజ్ఞానశాకుంతలమునందును విస్తరింపఁబడినది. భారతప్రోక్తకథ మూలముగను కాళిదాసుని నాటకక్రమమును గైకొని క్రొత్తదనము నొడగూర్చి పినవీరన కావ్యరచన మొనరించెను.

ఇందుఁ బ్రథమాశ్వాసకథాభాగంబున దుష్యంతుని మృగయావిహారంబు విపులముగా వర్ణింపఁబడినది. "జుంజురువల్లెవెండ్రుకల జొంప

ములుం గలమస్తకంబులతో, పటుప్రకన్నులుగల్గి, కుంజరచర్మపట్టములకు పరివచ్చు మేనులుగల్గిన పుళిందవర్ణనము మిగుల స్వభావసిద్ధముగా నున్నది. మఱియు—

"పులిమల్లఁ డడవిపోతులరాజు గరుకుండు
గాలివేగంబు కుందేలపసిడి..." మున్నగు

వేటకుక్కలు ఆంధ్రకవితాపితామహుని మనుచరిత్రలోని

"పులియఁడు బూచిగాఁ డసురపోతులరా జనుమంతిగాఁడు చెం
గలువ సివంగి భైరవుఁడు గత్తెరపంజఁగి వెండిగుండు మ
ల్లెలగుది వాయువేగి చిటిలింగఁడు సాళ్వఁడు వత్సనాభి యే
కలములనెత్తి కబ్బియనఁగా గలవాని గ్రహించి యుద్ధతిన్"

అను పద్యములో వివరింపఁబడిన జాగిలంబులుగా నవతరించినవి.

మఱియు వినాయకస్తుతిలోఁ దొలుత—

"జననీస్తన్యము గ్రోలుచుం జరణకంజాతంబునం గింకిణీ
స్వనమింపారఁగఁ దల్లిమీద మృదులస్పర్శంబుగాఁ దొండ మ
ల్లన యాడించుచుఁ జొక్కు విఘ్నపతి ..." పెద్దన రచనలో

అంకముఁ జేరి శైలతనయాస్తనదుగ్ధము లానువేళ బా
ల్యాంకవిచేష్టఁ దొండమున నవ్వలిచన్గబళింపఁ బోయి యా
వంక కుచంబుఁ గానక కహీవల్లభహారము గాంచి వే మృణా
ళాంకురశంక నంటెడుగజాస్యుని గొల్తు నభీష్టసిద్ధికిన్.

అను వినాయక స్తుతిగా ననుసరింపఁబడినది. కావున శ్రీనాథ కవిరాజశేఖరునితో పాటు పినవీరన గూడ పెద్దన కవిత్వమునకు జీవకళ చేకూర్చెనని విశ్వసింపనగును.

ఈకావ్యమున శకుంతలాజన్మవృత్తాంతము దుష్యంతున కంతేవాసి వలన విపులముగా వినిపింపఁబడినది. ఇందలి శీతశైలవర్ణనమునందు "అలరింపెంపొందు పూర్వాపరాంబునిధుల, నడుమ ధరణికిమాన

దండంబువోలె'' అనుపట్టున గాళిదాసుని కుమారసంభవకావ్యములోని

"పూర్వాపరౌ వారినిధీ విగాహ్య
స్థితః పృథివ్యా ఇవ మానదండః'' అను శ్లోకార్థమును పఠింపఁబడినది. మఱికొన్ని శ్లోకముల భావములు కూడ తరువాతి పద్యములలో హిమనగవర్ణనమునఁ గనుపించును! ఈవర్ణన మిచ్చట "నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయ వర్ణనమ్'' ఇత్యాది ప్రబంధలక్షణములోని శైలవర్ణనమునకు మార్గదర్శక మగుచున్నది. విశ్వామిత్రుఁడు పరమశివు నారాధించు తపశ్చర్యాదికములు మిగుల సొగసుగా వర్ణింపఁబడి యోగవిద్యా విశేషంబుల విజ్ఞానమును వెదఁజల్లుచున్నవి. మీఁదిగాడ్పుఁ గ్రీగాడ్పుతో మేళవించుట భానుశశిమార్గములు కట్టువఱచుట, మధ్యమనాడి చిద్గగన పీఠం జెందుట మున్నగునవి యున్నతయోగ రహస్యంబులు.

తరువాత మేనకాప్సరోంగన తపోవనంబున కేతెంచునపుడు మధుమాసలక్ష్మి యేతెంచినది. తరణి మధువేళ పద్మినీసరసకేళిం బడియుటచే వాసరంబులు దీర్ఘంబు లగుటయు నాతఁడు విరహవేదననై పమి రథంబుఁ దఱిమికొని వచ్చుటచే రాత్రులు కొంచెపడుటయు మిగుల హృదయంగమము. విహారవిలాసినులు పుష్పాపచయ మొనరించుఘట్టము రమణీయ మగును.

''వలపు గాడ్పులూర్పులఁ గలసి వెలయఁ
దుమ్మెదలుఁ గుంతలమ్ములు దొట్రికొనఁగ
పువ్వులును నవ్వులును గూడి పొత్తుగలిగ
విరులు గోయఁదొడంగి రవ్వేళయందు'' అనుచో విలాసవతులు పువ్వులును నవ్వులును పొత్తుగూడుట నూతనమై ప్రీతి గొలుపును. వనవిహార పుష్పాపచయాది వర్ణనలెల్లం బ్రబంధకవులకు మార్గదర్శకములుగా నున్నవి.

పిదప శకుంతలను దుష్యంతుఁడు వర్ణించు సందర్భమున

"కొనకొని తావి మూర్కొనఁ గనిక్రొవ్విరి మెయ్యెడ వజ్రసూచి డాయని రతనంబు......" అను పద్యము "అనాఘ్రాతం పుష్పం" అను కాళిదాస శ్లోకమున కనువాద మగును. నాయికానాయకు లన్యోన్య విరహావేదనాభారంబులు, తత్సమయమున విశదమగు శృంగారచేష్టలును కడు హృద్యములు.

తృతీయాశ్వాసంబున తపస్వు లతిరాత్రం బను సత్త్రతంతువు నిరంతరాయముగా నొనర్ప రక్షణంబు నర్థించుట పొసంగును. కాళిదాసోక్తులలో "తత్కతిపయరాత్రం సారథిద్వితీయేన భవతా సనాథీక్రియతాం మహాశ్రమ ఇతి" అని చెప్పఁబడినది. అనసూయాప్రియంవదలు దుష్యంతునితో "ఈకలికిబోడికి నీకును బుట్టుపుత్త్రుఁ బ్రస్ఫుటిగ యౌవరాజ్యపదపీఠమున న్నిలుపంగ శపథంబు నీదగు"నని చెప్పుటయు నంత దుష్యంతుఁడు కాశ్యపముని మనుమని యువరాజుగా నొనర్తునని అంతరంగకులస్వామ్యాదిసాక్షులఁ జేర్కొని మాటయిచ్చుటయు జరిగి నంత వారలు శకుంతలాదుష్యంతుల గాంధర్వమున ననుకూలదాంపత్య సౌఖ్యంబుల నవిచ్ఛిన్నప్రీతి ననుభవించునట్లు దీవించి వానప్రస్థ ముకుళంబుల నిరువురిశిరంబులఁ జల్లుట యెంతయు సంతసము గొల్పు స్వతంత్రరచన.

తరువాత దుష్యంతుఁడు కాళికాముఖాదిరాక్షసులతోడి సమర మొనరించుట వీరరసవిలసిత మగుకథాభాగము. అంధకారచంద్రోదయాదివర్ణనము లెల్ల భావిప్రబంధములకు మార్గసూచకములు. మనోహరభావ బంధురములు. శకుంతల చంద్రోపాలంభన మొనరించి యనంతరము తనమనోనాథు వంశనాథుఁడు వంద్యుండు కాని నింద్యుండు కాఁడని 'స్వామీ చంద్రమ తప్పుపట్టకు మది స్మరించుగారామునకు' అని వేడికొనట యుక్తిచాతుర్యములతోఁగూడి శ్రోత్రపేయమగును.

నాయకుఁడు వేల్పుటుత్పలగంధియుం దానును కందర్ప దర్పంబనల్పం బుగా వర్తించునెడ శృంగారరస భూయిష్టంబగు వర్ణనాదికములు సహృదయహృదయంగమములు. చతురంగబలములును హాస్తిపురి గదలి వచ్చినట్లు కల్పించి యుద్ధసన్నద్ధసైనికనికాయంబులు ప్రత్యక్షముగాఁ గడలుచున్నరీతి సైన్యంబులను వర్ణించుట యెంతేయు ముదావహము. ఇయ్యవి పీఠికఁగొల్పు నూతనకల్పన యగును.

చతుర్థాశ్వాసమున కణ్వమహాముని యరుగుదెంచి "ఎన్నఁడు లేని కొ్రొత్తసిరి నీనెడు నీవదనాంబుజంబు" అని యడుగుటయు నయ్యెడ శకుంతల గజగజ వడకుచుఁ దొట్రుపాటు నొందుటయు సంభవించును. తరువాత నరుగుదెంచిన సంయములతోఁ గులపతి కణ్వుఁడు చంద్రవంశ మెల్ల వివరించిచెప్పి యట్టి వంశవిఖ్యాతుఁ డగువాఁడు దుష్యంతమహారాజని యెల్లరకుఁ దెలియఁజెప్పుట 'పితా శ్రుతిమ్ బాంధవాః కుల మిచ్ఛంతి" యను సూక్తుల కుదాహరణంబు లగుచున్నవి. శకుంతలా దుష్యంతుల గాంధర్వవివాహము తపస్వి తెఱుంగమిం జేసిం కణ్వుఁ డీరీతి విపులీకరించి దుష్యంతుని వంశవిఖ్యాతి చెప్పెననియు నేతద్వృత్తాంత మంతయు రసోత్కర్షకు హేతువగు ననియుఁ దెలియనగును. దుర్వాసోముని శాప వృత్తాంత మిందుఁ బ్రస్తావింపఁబడినది. అనసూయాప్రార్థనాలాపంబుల నాలించిన మునీంద్రుఁడు కృపాసాంద్రుఁడై ముద్రికాదర్శనంబు శాపావధిగా నచించి వెడలును.

తదుపరి దౌహృదసుతజననాదులు విశదీకరింపఁబడినవి. ప్రబంధ కవుల కియ్యవి మార్గదర్శములు.

"జీవితేశ్వరుఁ బాసి చిరకాలవసతిగాఁ
బుట్టినింటనె యున్కి బుద్ధిగాదు" అని కణ్వమహర్షి శకుంతల నత్తవారింటికి పంపుసందర్భమున నాతని నీతివాక్యము లర్థవంతములై యాహ్లాదజనకము లగును. కులస్త్రీలు వర్తింపవలసిన తెఱంగు

లిందు మహర్షిచే నుపదేశింపఁబడినవి. పిదప నత్యంతరమణీయ మగు ఘట్టము కణ్వుఁడు శకుంతల ననుపు సందర్భమునఁ గాంచనగును. అతని హృదయగతభావసంచయము—

“పొమ్మనఁజూచుఁ జూచి మదిఁ బుట్టిన ప్రేమము పెర్మి బాష్పముల్
గ్రమ్మినఁ గ్రమ్మఱం బెడ మొగంబయి కన్నులనీరు మ్రింగుచున్,
గ్రమ్మఱఁ దా శకుంతల మొగంబున
నశ్రులుసించుఁ గొంతసే,
పమ్మని జాలిఁ బొంది ధృతియంతయు నిల్వక విచ్చిపాఱఁగన్”

అను పద్యమున హృద్యముగా విశదీకరింపఁబడినది.

“కర్కశధారాకఠోరంబైన కత్తుల క్రొవ్వాడి కొడవంటఁ గోయ రాదు” అను పద్యమున మోహలతను ద్రెంపసాధ్యముకా దనుచిత్తంబుల హత్తుకొను రసవంతమగు వర్ణనము.

‘అత్తమామలకు నీయుపసేమి వెట్టుచుఁ
గనుసన్నఁ జేయుమీ పను లెఱింగి’ అనుపద్యమున కాళిదాసోక్తమగు ‘శుశ్రూషస్వ గురూన్ కురు ప్రియసఖీవృత్తింసపత్నీజనే” అను శ్లోకార్థము విపులీకరింపఁబడినది. మఱియు శ్లోకచతుష్టయముగా నెన్నికఁగన్న యితరశ్లోకార్థములంగూడ పినవీరన సీసపద్యములలో ననువదించెను.

“మహనీయ సంయమంబ మహాధనంబుగా నతియించివర్తించు మమ్ముఁదలఁచి......”

“అస్మాన్ సాధు విచింత్య సంయమధనా నుచ్చైః కులం చాత్మనః
త్వయ్యస్యాః కథ మప్యబాంధవకృతాం స్నేహప్రవృత్తిం చ తామ్
సామాన్యప్రతిపత్తిపూర్వక మియం దారేషు దృశ్యాత్వయా
భాగ్యాయత్త మతః పరం న ఖలు తద్వాచ్యం వధూబంధుభిః”

తరువాత "జనకుండుండెడు ననుస్థాన వేదికఁ జూచుఁ జూచి క్రిమ్మఱఁ బోయి చూడవచ్చు" ననుపద్యము శకుంతలా హృదయమందలి యారాటము దెలుపుచున్నది.

సంతాపహర్షంబులు పెనంగొని యశ్రుజలంబుల వెల్లార్చు శకుంతలామూర్తి మనకనులయెదుటఁ గన్పట్టి హృదయమును ద్రవీభూతమొనర్చును. కాళిదాసనాటక చతుర్థాంకమునకు గూడ నీఘట్టము వన్నెబెట్టుచున్నదని విశ్వసింపనగును. అనిమిషనది రత్నాకరమున కేఁగెడు భంగి శకుంతల మునిభామలతోఁ గదలిపోవు పవిత్రదృశ్యము పాఠకులహృదయముల నిచ్చలు నిలుచు ననుటకు సందేహము లేదు.

కడపట పశ్చాత్తప్తుఁడై రాజు తన్నుఁదా నిందించుకొనునవసరంబున కాంతిజితశరచ్చంద్రుం డగుమారీచుం డరుగుదెంచి దుర్వాసశ్శాప వృత్తాంత మాతని కెఱుకపఱచి యనంతరము యువరాజగు శాకుంతలునకు రాజనీతివిశేషంబు లుపదేశించుటతో నీకావ్యంబు మంగళాంతమగును.

ఇందలి శైలివిశేషములలో మృదుపదబంధురంబు లగునానుడులు "తీటఁగొనినం గొఱవిం దల గోఁకికొందు రే" "తూచా తప్పక యుండఁ జెప్పె నిజబంధుల్మిత్రులాప్తుల్వినన్" "అఁటిపండొల్వనేటికి నినుప గోరు" "...మెడఁబెట్టుకొంచుఁదిరుగన్ హారంబు లేభామినుల్" మున్నగునవి యెంతయు రమణీయములు. కృత్యాదిని వాకొనినట్లు నన్నపార్యాది మహాకవుల వాక్యస్ఫూర్తు లందు గన్పట్టుచున్నవి. పినవీరనకవిత స్వప్నాధ్యాయాది శాస్త్రవిషయంబులతో విశిష్టమైయొప్పారుచున్నది. నిక్కువముగా నీపరిబంధమున వాగ్దేవి విభ్రమశ్రవణకల్హారోదయామోదంబులు గుబాళించుచున్నవని యీ దిగువపద్యముల స్తుతించి వ్యాసమును ముగింతును.

వాణి వశం బటంచు గరువంపునుడు ల్వెలిపుచ్చి "వాణినా
రాణి" యటన్న పల్కులు స్థిరంబుగ నాంధ్రులమానసంబులన్
పోణిమిగా వసించు సమబుద్ధిఁ దలంచిన నీయుక్తి వి
న్నాణము పెద్దనార్యుఁడు గొన న్గనె నిక్కము పిన్నవీరనా.

కాళీదాసుని రమ్యకల్పనల లెక్కల్ మీరు శాకుంతలం
బాలోకింపఁగఁ గణ్వమౌని నుడు లొయ్య న్నయ్యమొప్పారు స
చ్ఛీలంబుల్ ప్రకటించు ఘట్ట మది వాసింజెందు నాంధ్రోక్తులన్
మేలై పొల్పు రసప్రసాదమునఁ గామింపంగ నో సత్కవీ.

సల్లలితంపుసూక్తులఁ బ్రసాదగుణంబున మాధురీధురీ
ఫుల్లసరోజసంపదలఁ బొల్పు పరఃప్రతిమానశోభ రం
జిల్లెడుపల్కుసోయగము చిత్తము లోఁగొన సంస్తుతింతు నో
పిల్లలమఱ్ఱి వీరనకవీ! గొనుమా యివె మా నమస్కృతుల్.

# చింతామణి - పదాది యకారసిద్ధాంతము

శ్రీ రాంభట్ల లక్ష్మీనారాయణశాస్త్రి.

చిరకాలమునుండియు నాంధ్రవైయాకరణుల హృదయాంతరాళముల వివాదాస్పదమై మెలంగు పదాదియకారసిద్ధాంత మవిచారమూలక మని తెలియఁజేయుటయే యీ వ్యాసమునకుఁ బ్రయోజనము. సుహృదయు లగు విజ్ఞు లందలిసారస్యమును గ్రహింతురుగాక.

ఆంధ్రభాషయందు వికృతిపదాదిని యకారము గల దని కొందఱును, లే దని మఱికొందఱును నాంధ్రవ్యాకర్తలు దలంచిరి. ఆంధ్రవ్యాకరణములలో మొదటి దని పరిగణింపఁబడుచున్న యాంధ్రశబ్దచింతామణి వికృతివివేకములందు పదాదియకారసిద్ధాంతము గల దని మొదటి తెగవారి యుద్దేశము. "అద్యాః క్రియాసు ధాత్వర్థద్యోతిన మాద్యగం వినా సర్వే" "సర్వత్రాప్యత్ర ఖ్యాం జ్ఞేయం యస్య ప్రకృతి ప్రకృతికేభ్యః" అను చింతామణియందలి సూత్రద్వయమును, "వికృత్యాదిగతో యోత్ర స్యా చ్ఛబ్దాంతరయోగతః ప్రాణసూత్రావశేషస్స్యా దత్ర శ్రీకవిసమ్మతే" అను వికృతివివేకస్థకారికయును వారి వాదమునకుఁ బ్రమాణములు. పైసూత్రములనుబట్టి వికృతిపదాదిని యకార మున్నదనియు, దాని కజ్వద్భావ మంగీకరింపవలె ననియు, నిది నన్నయాథర్వణులసిద్ధాంత మనియుఁ బై వారియాశయము.

ఇఁకఁ బదాదిని యకారము లే దనువారిలో మొదటివాఁ డప్పకవి. ఇతఁడు "అరయ వైకృతోక్తులఁ బదాదులయందు యకార ముండ దాతీరునఁ బల్కు వ్రాఁత గణుతింపఁగ నచ్చగు దానిదావలన్ నీరజనాభ! నాంతిమములు నిల్చిన నచ్చుటఁ బ్రాణసంధి చెన్నారు నితండు చైద్యవసుధాధిపు నే పడగించె నేఁ డనన్" అని తనగ్రంథమునఁ జెప్పెని, వికృతిపదాదియందు యకార ముండ దని స్పష్టముగా

జెప్పెను. అతఁడిట్లు పదాదియకారమును నిషేధించుట కాతనికి లభించిన “అద్య క్రియాసు భూతాద్యర్థసముద్ద్యోతినం వినా సర్వః” “వికృతిపదాదౌ ప్రథమాంతస్థస్మృతీయానునాసికౌ న స్తః, క్వచిదపి సన్త ఉవోత్తౌ దంతోష్ఠభవస్య విస్మృతిశ్శబ్దౌ” అను చింతామణి సూత్రములే మూలాధారము. రెండవ వ్యాకర్త చిన్నయసూరి. ఈతని బాలవ్యాకరణమున “యకారంబును వుపూవోవోలును దెలుఁగు మాటలను మొదట లేవు” అనుసూత్రము గలదు. దానంజేసి పదాదియకారమాతనికి సమ్మతము గాదని స్పష్టముగఁ దెలియుచున్నది. అప్పకవీయ సిద్ధాంత మాతనికి సమ్మతమైనట్లు ప్రణాళికనుబట్టి గోచరించుచున్నది.

ఇంక వ్యాఖ్యాతలలో బాలసరస్వతి పదాదియకారము నంగీకరించెను. అహోబలపండితుఁ డద్దానింగూర్చి చర్చించి యయ్యది నన్నయాభీప్సిత మయ్యును బండితహృదయంగమము గాదనియు, నప్పకవీయసిద్ధాంతమే సాధు వనియు నిర్ణయించెను. దానిచే నాతనికిఁగూడఁ బదాదియకార మసమ్మతి మగునట్లు స్పష్ట మగుచున్నది. ఆతని వ్యాఖ్యానము. “అప్పకవి పుస్తకే తు” “అద్యః క్రియాసు భూతాద్యర్థసముద్ద్యోతినం వినా సర్వః”ఇతి పాఠః స్థితః.అదశ్శబ్దస్య పోయెదన్ - చసయెదన్ - ఇత్యాదా వత్వం పూర్వపాఠే త్వేతి స్న గృహ్యతే. కల్పనాగౌరవ మతీవాపాద్యతే.న చోచ్చారణలాఘవ మేవ తస్యైత్వే ప్రయోజనం, తదర్థం కల్పనాగౌరవ మంగీకార్య మితి వాచ్యం. తదభావేఽపి బాధకాభావేన తదపేక్షయాఽతికల్పనాగౌరవాంగీకారస్యానుచితత్వాత్. “ఆద్యవర్ణా స్తు హా త్వేన న గృహ్యంతే కదాపి చ” ఇత్యథర్వణాచార్యస్య స్వసిద్ధాంతవచనాచ్చ. తస్మా దప్పకవి పుస్తకపాఠ ఏవ సాధు రితి ప్రతిభాతి. “సర్వత్రాప్యత్వాకార్య” మితి సూత్రం తు తత్పుస్తకే న దృశ్యత ఏవ. తేన ‘ఎవ్వఁడు’ ఇత్యాదావత్వ మాదౌ న పండితహృదయంగమమ్”.

దీని నాధారముగఁ జేసికొని కాబోలు భాషాచరిత్రకారులును, భాషానుశాసనకర్తలును, బదాదియకారమును నిరసించిరి.

ఆంధ్రవ్యాకరణసర్వస్వము మున్నగుమహావ్యాకరణగ్రంథములను రచించిన శ్రీవజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు మాత్రము నన్నయాథర్వణుల కిర్వురకుఁ బదాదియకార మిష్టమే యని తమ చింతామణివిషయపరిశోధనమున. గల్పతరువునందు, సర్వస్వమున వివరించి విమర్శించి సిద్ధాంతీకరించిరి. ఇట్లు అస్తి నాస్తి విచికిత్సాహేతు వగుపదాదియకారము చివరకు శ్రీశాస్త్రిగారిసిద్ధాంతము నాధారముగఁ జేసికొని నిలిచి యున్నది. "ద్రవిడకన్నడాదిభాషలలో యకారాది పదము లుండుటం జేసి తెలుఁగునఁ గూడ నన్నయకుఁ బూర్వముననే వికృతిపదాదిని యకారము గలదు. అట్టివానిని నన్నయ యంగీకరించెను. అందలిస్వరనిర్ణయమునకై "అద్యః క్రియాసు" అనుసూత్రమును రచించెను. అయ్యది సంధిగతమైనచో దానివలన వచ్చునపసంధులను నివారించుటకై "సర్వత్రాప్య త్కార్యం యస్య" అనుసూత్రమును రచించెను" అనునది శ్రీశాస్త్రిగారిసిద్ధాంతవచనసారము. దీని నిటఁ గొంత విమర్శింతము.

పైవివాదములకును మతభేదములకును మూలకందము చింతామణియందలి సూత్రరాజము. అయ్యది బాలసరస్వతీయమున నొకవిధముగను, అప్పకవీయపాఠమున నింకొకవిధముగను గలదు. "అద్యః క్రియాసు భూతార్థద్యోతిన మాద్యగం వినా సర్వః" అనునది సరస్వతీయము. "అద్యః క్రియాసు భూతాద్యర్థసముద్ద్యోతివం వినా సర్వః" అనునది యప్పకవీయము. ఈసూత్రద్వయ మొకేతీరునఁ గానరాదు. కొలఁదివ్యత్యాసములు గలవు. మఱియు సూత్రార్థమును బరికించినను, బదసంపుటినిఁ బరిశీలించినను, సరస్వతీయ ముత్తమమనఁదగును. 'అది - సర్వ' పదముల నొకేసూత్రమునఁ జేర్చి వెట్టసూత్రకృత్తును

సూత్రరచనఁ గావింపఁడు. పైసూత్రము సర్థముఁజేసికొనుటలోఁ గలిగిన వ్యత్యాసముచే నీయనేకభేదములకు మార్గము లయినవి. పదాదివి యకార మున్నట్లు వ్యాఖ్యానించినవారిలో మొదటివాఁడు బాల సరస్వతి. తనుపరి యహోబలపతి. వారు సూత్రార్థమును భిన్నరీతుల వివరించుటచే నధునాతను లిన్నిరీతుల నూహించుకొనుట కవకాశ మేర్పడినది.

సూత్రార్థమును గమనింపుఁడు. ఈసూత్రమునకు ముందుగ "లఘుర్వ్యలఘుశ్చేతి ద్వేధాంతస్థాః వదంతి శాస్త్రాః" అను సూత్రము గలదు. అది యంతస్థల లఘ్వలఘుతాభేదనిరూపణార్థ మువనిబద్ధము. తరువాత "అద్యః క్రియాను" అనుసూత్రము గలదు. ఇది క్రియాస్థయకారమందలి స్వరనిర్ణయార్థము వ్రాయఁబడి యున్నది. పిమ్మట "యశ్రుతి మార్యా లఘుయం ప్రివదంతి ప్రాణతః పరం ప్రాణం" అనుసూత్రము గలదు. అది లఘుయకారస్వరూపనిరూపణ పరము. దానివెనుక "నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయో స్తు నిత్యం స్యాత్" అనుసూత్రము గలదు. ఈసూత్ర మంతస్థల సాధర్మ్యవైధర్మ్యబోధకము. ఈనాలుగుసూత్రములు నంతస్థలం గూర్చియే కలవు. తరువాత చ-జ-లదంత్యతాలవ్యతానిరూపణము గలదు. ఇది యచ్చటి ప్రకరణము. ఈప్రకరణమున నేయేయక్షరము లాదియం దుండును? ఏవి యుండవు? అనువిమర్శ కాధారము గాన రాదు. అంతస్థలభేదవివరణమే యిందుఁ గలదు. యకారస్థాననిర్ణయార్థమే యీసూత్రము రచింపఁబడిన దందురా? మఱి వకారమును నేల మఱచెనో తెలియదు. కావున నీప్రకరణమునుబట్టి చూచిన నీసూత్రము యకారస్థాననిర్ణయార్థము రచియింపఁబడలే దని స్పష్టమగు చున్నది. ఇంక నీసూత్రమునకుఁ గవి యూహించినముఖ్యోద్దేశము "యకారమే క్రియయం దత్యభిన్నస్వరయుతము. ఏక్రియయం దత్వ

స్వరయుతము" అను విషయము. యకార మొక్క యత్వస్వరముతో డనే కూడియుండదు గదా! అయ్యది సర్వస్వరములతోడను గూడియే భాషయం దుచ్చరింపఁబడుచుండును గదా! అట్లుండ నీయత్వస్వర నిర్ణయమునుగూర్చి సూత్రకర్త కేల యిట్టిశ్రమ? యనుసందేహము మనకు జనించుచున్నది. అట్లు గల్గుటకుఁ గొంత యాధారము గలదు. అత్వము-ఎత్వము-అనుస్వరములు రెండును యకారముతోఁ గూడినప్పు డుచ్చారణమున భేద మున్నను శ్రవణమున మాత్ర మభిన్నత గోచరించును. పోయను-పోయెను-పోయదను-పోయెదను. అనుపదముల నుచ్చారణమున నయ్యది స్పష్టము. యకార మెప్పుడును దాలవ్యమే యగును గాని అకారయుతయకారము కంఠతాలవ్యస్వరవిశిష్ట మగుచున్నది. ఎత్వయుతయకారముగూడ నట్లే కంఠతాలవ్యస్వరయుతమే యగుచున్నది. స్వరమున విభిన్నతకవకాశము చాలఁదక్కువగ నున్నది. అట్టిసందేహములను లేఖనమున నివారించుటకై సూత్రకారుఁ డీసూత్రమును రచించి యుండకోపును. "అయ్యో! నాసుతుఁ గ్రద్ద తన్నుకొని పోయన్" అనునట్టిప్రయోగములు గలవు. క్రియలందే యిట్టిసందేహ మధికముగఁ జనించును. కాన క్రియలం దెచ్చటెచ్చట నేయేస్వరము లుండునో నిరూపించుట కీసూత్రము వ్రాయఁబడిన దనుట నిర్వివాదము. సూత్రప్రణాళికయుఁ బ్రకరణమును నిట్టియర్థమును నిరూపించుచుండ విస్మృతపదాదిని యకార ముండ దనునర్థ మెట్లుస్ఫురించెనో తెలియకున్నది. అం దాయర్థ మెచ్చటను ధ్వనింపలేదు.

ఎట్టియవకాశమును లేని యిట్టికల్పన మెట్లుదయించె నన శంక మాత్రము మిగిలినది. టీకాకర్తల వ్యాఖ్యములు వివరణములు నిట్టియను మానమున కవకాశము నిచ్చినవి. సూత్రమందలి "ఆద్యగం" అనుపద మీయూహల కాధార మగుచున్నది. దానిని గమనింపుఁడు. ఇంత వఱకుఁ బ్రచారమున నున్న సూత్రార్థము. క్రియాను క్రియలయందు;

భూతార్థద్యోతినం=భూతకాలార్థమును దెల్పునట్టియకారమును; ఆద్యగం =నామాదిగతమగు యకారమును; వినా=తక్క; సర్వః యః=సమస్తమైన యకారము; అత్=అకారముగలదగును. భూతకాలక్రియయందలి యకారమును, నామాద్యగయకారమును నైత్యస్వరవిశిష్టములు. మిగిలిన యకారము లన్నియు సత్వస్వరయుతము లని సూత్రతాత్పర్యము. ఇయ్యది పదాదియకారనామముల నిర్వచనము. ఇచ్చట "ఆద్యగం" అను పదమునకు నామాదిగతయకార మనునర్థము గలదు. కొందఱు దీని ర్శకు లద్దాని సంగీకరించిరి. మఱికొందఱు దానిని నిరసించిరి. అది యు ట్లుండనిందు. 'ఆద్య' పదమునకు నామాద్య మనునర్థ మెట్లు వచ్చెనో తెలియదు. పూర్వసూత్రములనుండి నామపద మనువర్తింపం బడె నని తలంప నవకాశము చాలదు. పూర్వసూత్రముల నెచ్చటను నామపదము గానరాదు. ఉత్తరసూత్రములనుండి యపకృష్ట మయ్యె నందమా? అదియును పొసంగదు. "ప్రాతిపదికం హి నామ" అను సూత్రమునుండి నామపద మపకృష్ట మయ్యు నయ్యని వ్యాకృతార్థోపయోగి కానేరదు. అచ్చట నామపదము ప్రాతిపదికార్థమున నిపతింపం బడెను. ఆపదము సప్తమ్యంతముగ విపరిణామము నందుటయును, సమాసాంతర్భాగముగ నన్వయించుటయును దుర్ఘటము. కాన నాయత్నము వ్యర్థమనక తప్పదు. మఱియు సూత్రపద్ధతిని బరికించిన నీసూత్రసమన్వయమే యనుచిత మని తోచుచున్నది. క్రియాపదములందును, నామములందును యకారస్వరనిర్ణయము గావింపందలంచిన సూత్రకర్త 'క్రియాసు' అనునిర్ధారణార్థకసప్తమిని గ్రియలకై ప్రయోగించి నామవిషయమున 'నామసు' అనుపదమును విరచింప మఱచెనా! "క్రియాసు భూతార్థద్యోతినం నామ స్వాద్యగం" అనియే సూత్రించి యుండును. మఱియు. 'వినా' యనుపదము ద్వితీయాంతము లగు 'భూతార్థద్యోతినం' 'ఆద్యగం' అనుపదద్వయముతో నన్వయించుచున్నది. ఆ రెండు పదములును నిర్ధారణార్థాభిధాయక మగు 'క్రియాసు' అనుసప్తమ్యంత పదముతో నన్వయింపవలసి యున్నది. అది వాక్యసమన్వయపద్ధతి.

అట్లుగాక మొదటిపదము దానితో సమన్వయించి రెండవపదము సమన్వయింపకుండుట సమన్వయపద్ధతికే విరుద్ధము. కాన నీసూత్రసమన్వయమే విరుద్ధముగ నున్న దనవచ్చును. ఇంతకుఁ బై వ్యాఖ్యానమునుబట్టి క్రియలయందు భూతకాలిక క్రియలనే గ్రహింపవలయును గదా! ఆ క్రియలే యత్వస్వరయుతము లయిన మిగిలినవర్తమానాదిక్రియలందలి యకార మెప్పుడును నత్వస్వరయుతము లగునా? భూతకాలమునందును నెత్వభిన్నస్వరయుత యకారములు లేవా? మఱియు, నామాద్యగమే యెత్వస్వరయుతమైన క్రియాద్యగ మెత్వస్వరయుతము కాదా! అను సందేహము లెన్నియో యంకురించుచున్నవి. కాన నీసూత్రము భాషయందలి క్రియానామపదజాతమంతటికి స్వరనిర్ణయార్థ ముపనిబద్ధ మనుకొనుట యసమంజసము. ఇయ్యది క్రియాపదములందలి మధ్యగతయకారమునుగూర్చి వ్రాయఁబడినట్లు గనఁబడుచున్నది. కావున నీక్రిందిరీతిని సూత్రసమన్వయమును గావించిన నిట్టియుపమార్గము లన్నియు నమసి పోవును. గమనింపుడు. 'క్రియాసు=క్రియలందు, భూతార్థద్యోతిసం=భూతకాలార్థము నెఱింగించు యకారమును, అద్యగం=తద్ధర్మకాలిక యకారమును, వినా=విడిచి, సర్వః=సమస్తమైన, యః=యకారము, అత్=అకారముగలది. క్రియాపదములలో భూతతద్ధర్మక్రియలందలి యకారము దక్క మిగిలిన క్రియలందలి యకార మత్వస్వరవిశిష్ట మని సూత్రమునకు భావము. ఇట్లు సమన్వయించిన 'పోయెను-పోయిరి-పోయెదరు-పోయెదను'-మున్నగురూపము లన్నియు సాధ్యము లగును. అభూతతద్ధర్మక్రియలుదక్క మిగిలినక్రియలలో వ్యతిరేకార్థమున యకారము గలదు. చేయఁగలడు-వ్రాయఁగలడు-చేయఁడు-వ్రాయఁడు-పూయఁడు-కోయఁడు-మున్నగునవి. వీనియందలి యకార మద్విశిష్టము. పై భూతతద్ధర్మములందలి యకార మత్వభిన్నస్వరవిశిష్టము. అనఁగా నెత్వయుతము నిత్వయుతము గూడ నగుచున్నది. సూత్రమున నెత్వమే గల

దను నియమము లేదు. కాన నెత్వైత్వములు సాధ్యము లగును. ఇట్లు క్రియలయందలి యకార మెచ్చటెచ్చట నెట్లుండునో నిరూపించుటకై యీసూత్రము వ్రాయఁబడియుండ నిందు నామములనుఁ జేర్చుట యనుచిత మనక తప్పదు. అట్లు నిర్వచనము గావించినప్పుడే సూత్రమున 'క్రియాసు' అనుపదము సర్వథా సార్థక మగును.

ఇఁక 'అద్యగ' పదమునకు తద్ధర్మార్థకత యెట్లులభించెనను ప్రశ్న మంకురించును. చింతామణి క్రియాపరిచ్ఛేదమున "తద్ధర్మవర్తమానాతీతాగామ్యర్థకాః క్రియా జ్ఞేయాః" అనుసూత్రము గలదు. అందు క్రియాసంఖ్యానమునఁ దద్ధర్మక్రియ మొదటిది. కాన నది యాద్యక్రియ యయినది. కావున 'అద్యగం' అనుపదమునకు నాద్యక్రియ యగుతద్ధర్మక్రియను బొందినయకారమును అనునర్థము స్పష్టముగ లభించుచున్నది. కావున నెట్టిసందేహమును లేదు. భూతగయకారమువలె నామాద్యగ యకారముగూడ నెత్వస్వరయుత మగు ననుభావము నంగీకరించిన అమ్మ-అయ్య-అప్పుడు-అచ్చట-అనురూపము లన్నియు నపరూపము లగును. వానియం దెత్వ మెచ్చటను వినఁబడదు. అందుచే బూర్వవాదము దోషయుతమై యపరూపములకుఁ దావల మగుచున్నదిగదా!

అట్లయిన "సర్వత్రాత్వ త్వాకార్యం జ్ఞేయం యస్య" అను సూత్రమునకు గతి యేమి? యనుశంక జనించును. నిజమే. కాని యీసూత్ర మప్పకవీయ పాఠమున లేదు. కాన నియ్యది పరిత్యక్తమయి యీశంకయే పరాస్త మగుచున్నది. ఎవ్వరో చింతామణికర్తఁ బదాదియకార మిష్ట మని యూహించి యీసూత్రము నిందుఁ బ్రవేశపెట్టియుందురు. ఈసూత్రము ప్రక్షిప్త మనుట క్రిందలిపదముచే నిదర్శనము. ఈసూత్రమున "ద్రుతప్రకృతికేభ్యః" అనుపద మనవసరము. ప్రపూర్వసూత్రమునుండి 'ద్రుతప్రకృతికాత్' అనుపద మనువర్తించుచునే యున్నది. "లుగ్వా ద్రుతప్రకృతికాత్" అనునది యాప్రపూర్వ

సూత్రము. ఆపద మనువృత్త మగుచుండ సూత్రకృత్తు బహువచనాంత మగునీపదము నేల ప్రయోగించును. దానిని మరల గ్రహించుటలో నాతఁడు సాధించినప్రయోజనము గానరాదు. కావన నీసూత్ర మొకపుస్తకమున లేనేలేదు. మఱియొకదానియం దున్నను ప్రక్షిప్తప్రాయ మగుచున్నది. కావున దీనిని త్యజించుట యుత్తమము.

అట్లయిన "వికృత్యాదిగతో యాత్ర" అను నాథర్వణకారికకు గతి యేమి యని శంక గలుగుచున్నది. అథర్వణుఁడు "ఆద్యవర్ణా స్త్వహాత్వేన న గృహ్యంతే కదాచన" అను నొకకారికను రచించెను. ఆకారికార్థమును గమనించిన నచ్చు లేనాఁడును హల్లులుగఁ బరిగణింపఁబడ వని తెలియుచున్నది. అట్టికారికను రచించిన యాయథర్వణుఁడు 'వికృత్యాది' కారికను వ్రాసి స్వవచోవ్యాఘాత మొనరించుకొనునా ? ఇది యసంభవము. కావున నీకారిక యన్యకర్తృకమై యిందుఁ బ్రవేశించి యుండును. ఇంతేకా నాకారికయందలి రెండులిఙ్స్వరూపములును రెండవ్యయములును (స్యాత్-స్యాత్-అత్ర-అత్ర) దాని యధునాతనత్వమును దెలుపుచునే యున్నవి. అన్వయపారశ్య మాకారికయందుఁ గానరాదు. మఱియు నయ్యది శ్రీకవిమతము గాని యథర్వణుని మతము గాదు. శ్రీకవి యన నన్నయభట్టే యని చెప్పుటకుఁ దగినప్రమాణములు లేవు.

"ఆద్యవర్ణాస్తు" అనునాథర్వణకారికకు శ్రీశాస్త్రిగారు వింతగ నొకయర్థమును వ్రాసిరి. "ఆది+అవర్ణాః=అద్యవర్ణాః మొదటియక్షరము లగు నకారాకారములు" అని. అవర్ణములన నకారాకారములు గ్రహింపఁబడును. వర్ణమాలలో నయ్యవి మొదటియందే కలవు. వానికి 'ఆది' అనువిశేషణ మేల? "ఆద్యవర్ణము లన పదము మొదటివర్ణములు" అని యహోబలపతి వివరించినట్లును జెప్పిరి. ఆద్యవర్ణములు స్వరములు. ద్వితీయవర్ణములు వ్యంజనములు. స్వరము లేనాఁడును వ్యంజనములు

కాఁజాలవు. అనుక్షుణ్ణ మగుపూర్వముండ వీ రీదాఁరెఁ గ్రొత్తులకుఁ గారణము గానరావు. "హత్యేన" అనుపదమే 'అది' పదమునకు 'స్వర ములు' అనునర్థము నిచ్చుచున్నది గదా?

ఇంక శ్రీశాస్త్రిగారు ద్రావిడకన్నడాదిభాషలలో యకారాది రూపము లుండుటచేఁ దెలుఁగునఁ గూడ నన్నయకుఁ బూర్వ మట్టి యకారాదిపదము లున్నవనియు, నన్నయ యట్టివాని నంగీకరించె ననియు వ్రాసిరి. ద్రావిడకన్నడాదిభాషలమాట యటుండనిండు. తొలుతఁ దెలుఁగున నట్టిపదములు గలవా? యనుసందేహము గలదు. తెలుఁగున నట్టిపదములు గానరావు, నన్నయభారతమునఁ గలవా? ఎచ్చటను గానరావు. నన్నయకుఁ బూర్వము శాసనములం దున్నవా? శాసనములందునను రెండుమూఁడుస్థలములందుఁదక్క మఱియెచ్చటను నట్టిపదములు గానరావు. అవియు సంధివశముననో యుచ్చారణవైవిధ్యముననో వచ్చియుండును. శాసనస్థపదములను బరికింపుఁడు. ఈశాసనస్థ పదజాల మంతయు నాచార్య శ్రీ గంటి జోగిసోమయాజిగారి 'భాషా వికాస' మనుగ్రంథమునుండి గ్రహింపఁబడినది.

1. చాళుక్యమహారాజుధర్మవరపుశాసనము.
   ఇరెయెట్టు - పాపంబుయన్నదీ
2. యుద్ధమల్లునిశాసనము.
   ఊల్లు - ఎఱు - ఏఱువేళు
3. జయసింహవల్లభశాసనము.
   ఎఱుంబొంది.
4. జయవల్లభుని మాచెర్ల శాసనము.
   అరుపుటుఁళ్లు-అర్లపట్లు-ఎళ్లువాన్ఱు,
5. పండరంగనిశాసనము.
   ఏఁర్పడి-మల్లఅయ్యణ.

6. అహదనకర శాసనము.

ఇరుభరి-ఏళ్లు-ఏళ్గవిలో-ఏఱువేఱు-ఏలుచుణ్ణి.

7. జయసింహ శాసనము.

అన్నేట్టఱ్-ఒకాడుబోళచేఱ-ఏళ్గవిలో

8. ప్రాచీనాంధ్రశాసనము.

ఇచ్చిన-అడ్లువట్లు.

9. సత్యాదిత్యుని మాలపాడు శాసనము.

ఏఱువేల-ఏలుచున్ది-ఇచ్చిన.

10. చాళుక్యభీముని బెజవాడ శాసనము.

ఉమ్మరికిన్థిలోళ్.

11. మచిలీపట్టణపు తామ్రశాసనము.

అడుపు

12. అమ్మరాజ శాసనము.

ఇన్దనీ చెఱువు- రేయఱు-గణ్ణశాలయప్పవయ్యరివణ్ణాన - అత్తివి నాణ్డు-ఆరువిల్లి - యిడి-సూరు - యుల్లికొదమణ్డ్రి-ఇఱ్ఱుల కోరు-ఇడియూః పాలగరుసు.

13. ఇంద్రవర్మ నాగూరు శాసనము.

ఇబ్బన్లి-ఇట్టలూర్.

14. వేములూరుపాడు శాసనము.

ఏటియకతిలి-అన్మగఱ్ఱపు-అణ్డకి.

15. సిరిపూణ్డి శాసనము.

అదూరి.

16. ఇంద్రవర్మకొండనగూరు శాసనము.

ఇఱ్ఱలూర్-ఇర్లపాడు.

పై శాసనము లన్నిటియందును నజాదిపదములే యున్నవి. రెండు మూఁడుపదములందుమాత్ర మాదియందు యకారము గలదు. అదియు సంధివశమున వచ్చి భాషలో నిట్లు స్థిరపడి యుండనోపును. ఇంతేకు నజాదిపదజాలమే శాసనములందు స్పష్టముగ గోచరించుచున్నది. కాన దాని నంగీకరింపక తప్పదు. ఇట్లు భారతమునను, భారతమునకుఁ బూర్వమునను, బదాదియకారయుతపదములు గానరావు. ఇఁకఁ దమిళ కన్నడములందుమాత్రము యార్ - యానై - యేఱు-అనునట్టి పదములు స్వల్పముగ నున్నవి. ఆభాషలలోఁ గూడఁ బదజాత మంతయు యకారాదియయిన నద్దానిని మన మంగీకరింపవచ్చును. సంధివశము ననో, మఱి యేకారణముననో, గొన్ని పదములయాదిని వచ్చి చేరిన యకారము నాధారముగ నొకసిద్ధాంతమును గల్పించుటయు, దాని స్థిరత్వసిద్ధికై పలుపాట్లు పడుటయు హాస్యాస్పదముగ నున్నది. అరవ కన్నడాదిభాషలలో నెన్నో యపభ్రంశరూపము లుండును. ఆభాషల కును నాచ్ఛికభాష యగు తెలుఁగునకును సహజాతత్వరూపసామ్య మున్నంతమాత్రమున నందలిపదముల నన్నింటిని నిందుఁ జేర్చి వానిని సాధింపఁ బ్రయత్నించుట మరుమరీచికాజలయత్నమువలెనిష్ఫలము. కాన నీపదాదియకారసిద్ధాంత మసమంజస మనఁదగును.

ఇంకను శైవ్యాఖ్యాత లీసూత్ర మిత్వమును సత్వమును నిర్ణయించుటకు రచింపఁబడె నని పల్కిరి. కాని యత్యభిన్నస్వర మని యెవ్వరును వివరింపరైరి. యకారము సర్వత్ర యీ రెండుస్వరముల తోడనే కూడియుండునా? మిగిలినస్వరములగతి యేమి? ఎత్వ మను నర్థము వీరి కెటనుండి లభించినది? భూతార్థక్రియలం దేత్వయుతరూప ములే గలవని యుండునా? ఇత్వస్వరయుతరూపము లేనా? 'పోయెను' అనున దేత్వయుతరూపమయిన 'పోయిరి' అన నది యిత్వయుతరూ పము గాదా! కావున నీసూత్రవ్యాఖ్యానము సరసముగ నుండనందున నిన్నిపాట్లు పడవలసివచ్చినది. ఎట్లు బరికించినను నీపదాదియకార సిద్ధాంత మవిచారమూలక మనఁదగును.

---

# నీలకంఠ విజయము - ఆంధ్రీకృతి.

శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి.

(ప్రథమాశ్వాసము)

శ్లో॥ వందే వాంఛితలాభాయ కర్మ కిం తన్న కథ్యతే
కిం దంపతి మితి బ్రూయా ముతాహో దంపతీ ఇతి.

వాంఛితార్థసిద్ధికి నమోవాక మిడుదు
నెవరికో యన వారి నే నెంచి యనను
మతి ననేకత పొసఁగు దంపతుల కనిన
దంపతి కటన్న దుష్టశబ్దత ఘటిల్లు.

శ్లో॥ దేవానా మపి దైవతం గురు మపి ప్రాచాం గురూణా మిహ
శ్రీమంతం మదనాంతకం కథమపి స్తోతుం కృతో నిశ్చయః
తేన త్వాం త్వరయామి భారతి! బలాత్కృష్టాపి దుష్టే పథి
ప్రాణే శోపహతాపి జాతు కుపితా మా స్మ ప్రసాదం త్యజః.

గురువులకెల్ల సద్గురు నకుంఠిత తేజుని దేవదేవునిన్
స్మరహరు లోకరక్షకుఁ బ్రశంస లొనర్పఁ దలంతు, నిందుఁ దొం
దర గలిగించి నిన్ను గుపథంబుల నీడిచి ప్రాసబాధలన్
సరగున నొవ్వఁజేసినఁ బ్రసాదము వీడకు మమ్మ భారతీ!

శ్లో॥ చాతుర్యే[illegible] [illegible]ిణయేన చాపహరతః పల్లీషు గవ్యాస్వపి
స్తూయంతే చరితాని చేత్కవికులోద్గీతాని గాథాశతైః
త్రైలోక్యోద్భటకాలకూటకబళీకారప్రకారం పునః
స్తోతుం కే ప్రథమేపి నామ కవయో మారే ధికారో స్తు నః.

ప్రముచ్చిలితొ మహాప్రణయముం బచరించితొ వెన్నముద్దలన్
దెచ్చినకృష్ణగాథలు కదించిరి వేలకొలంది సత్కవుల్
రెచ్చిన శ్లేషము స్నటీముఖిన్ దిగమ్రింగుట ముందు నెవ్వరేన్
మెచ్చిరె? చూడ మాకిపుడు మెచ్చఁగ వర్హాతె యుండె దూరమై.

శ్లో॥ దుఃఖానాం క్షతి రిత్యబోధహాతి రిత్యానందవిస్ఫూర్త్తి రి
త్యంతర్వాణివికల్పజాలజటిలా న్మోక్షా దపి జ్యాయసీ
మైషా విప్రతిపన్నసౌఖ్యలహరీసంపాతసంపాదినీ
తత్సౌందర్యవివేచనీ కవయతాం మానం క్షమం హ్రీమతామ్.

అది దుఃఖక్షతి యుం చబోధహాతి యుం చానందవిస్ఫూర్త్తి యుం
చది విద్వత్సవికల్పవాగ్జటిలమోక్షాధిక్య మాస్థాన మం
చది సౌఖ్యప్రవహత్ప్రవాహ మని యేలా వల్క జల్పాకులై
మది సిగ్గున్నను, దాని యందములపై మానంబె మేల్ వేత్తకున్.

శ్లో॥ పశ్యన్ పదాగ్రమృదితాం మహతా గజేన
మాలాం ప్రసాదపరిపాకమయీం మృడాన్యాః
హస్తేన హస్త మభిహత్య స నిత్యకోపః
కోపారుణం ముని రధారయ దక్షికోణమ్.

చండికప్రసాద మగుసంపెగమాలిక నాబిడౌజు ను
ద్దండగజంబు పాదములఁ దన్నుట నల్పుటఁ గాంచి మించి, యా
చండతరప్రకోపనుఁడు చఱ్ఱున త్రేఁగుచు దండ తట్టుచున్
కండల మెండు గ్రిక్కదలఁగాఁ గనుగోనలఁ గెంపుఁ దాలిచెన్.

ద్వితీయాశ్వాసము

శ్లో॥ చేతో యద్భవతి శ్చిరంతనవచస్సందర్భగర్భస్థితే
వస్తున్యస్తమితప్రపంచమలినిమ్నాన్యమజ్జ మామజ్జతి
తద్దుర్మోచతమోవిమోహితమతి స్వాప్నా దకస్మా దిదం
నక్తం యత్పశుషు ద్విపా త్స్వపి తత్తో ధన్యా వయం నాయకః.

అస్తమితప్రపంచమలినావళి రై, పరవేదవాద వి
న్యస్తము నైనవస్తువునయందు రమించెడి మీామనమ్ము, వి
త్రస్తులమై యబోధపరితప్తులమై పసు లైనమాపయిన్
నిస్తులరీతి నొక్కపరి నిల్చుట ధన్యుల మైతి మోప్రభూ !

శ్లో॥ పశ్యజ్ఞానక్రియేచ్ఛామణిమయముకురాబద్ధ మధ్యాత్మవిద్యా
భాస్వద్రత్నప్రదీపప్రకరపరిహృతధ్వాంత మంత స్సమంతాత్
గాఢావిద్యాకవాటం ప్రబలశమదమద్వారపాలాభిగుప్తం
భక్తిద్వారం మురారే రిద మిహశయనాగార మోంకారరూపమ్.

సీ॥ జ్ఞానక్రియేచ్ఛావిశాలవినిర్మల
మాణిక్యదర్పణమండితమ్ము
అధ్యాత్మవిద్యామహారత్నదీపప్ర
కాశాపహృతతమఃకాండయుతము
పరమభక్తిద్వారభాసురగాఢబో
ధాభావఘనకవాటాంచితమ్ము
అప్రకంప్యప్రభావావిద్ధశమదమ
ద్వారపాలాభిగుప్తాంగణమ్ము

సకలజగముల రక్షింపఁ జాలియున్న
యోగనిద్రను జెంద నియుక్త మైన
యామురారి శయించుమహాభవనము
దివ్య మోంకారరూపమై తేజరిల్లు.

శ్లో॥ క్షంతారం సకలాగసాం జడధియాం యంతార మస్త స్తమో
హంతారం జగతా మనుత్తరపరాహంతాంకితోరస్స్థలం
ఉద్యత్కౌస్తుభశోభ ముత్పలవనీసచ్ఛాయ మచ్ఛాయత
స్నిగ్ధాపాంగతరంగ మైక్షిషి పరంబ్రహ్మాచ్యుతం శాశ్వతమ్.

తప్పులు సైచి ధీజడులదాపులు దిద్ది, జవాళియజ్ఞతల్
తుప్పునఁ దూల్చి, కౌస్తుభముతో నెదఁ దాల్చి రమన్, దయాబ్ధిలో
దెప్పలు తేలుచూపులను, దేటగునల్లనికల్వచాయతోఁ
జొప్పడుశాశ్వతుం బరముఁ జూచితి నచ్యుతు బ్రహ్మ నిమ్మెడన్.

శ్లో॥ జయ జయ జగదంబ జాంబూనదాంభోజకోశప్రభే!
జయ జయ కమలాక్షవక్షస్థలీహార్మ్యసర్మప్రియే!
జయ జయ కరుణాకటాక్షప్రతీక్షత్రిలోకేశ్వరే!
జయ జయ జనిమార్గలగ్నానువర్గాపవర్గప్రదే!

జయ జయ హాటకాంబుజలసన్ముకులప్రభ! లోకమాతృకా!
జయ జయ విష్ణువత్సగురుసౌధనిరంతరకేళితత్పరా!
జయ జయ లోకసాధపరిషత్ప్రతిపాలితశీతలేక్షణా!
జయ జయ జన్మమార్గపరిమత్తజగజ్జనమోక్షదాయినీ!

శ్లో॥ స్రష్టాసి తాత! జగతో ఽస్య చరాచరస్య
సంధారయ స్యథ ముఖై శ్చతురోఽపి వేదాన్
తేనాసి లోకదయితో దయితో ఽమమాపి
త ద్బ్రూహి కిం సఫలయామి మనోరథం తే.

కలితచరాచరాత్మకజగంబుల కెల్లను సృష్టికర్తవై
నలువగ నాల్గువేదముల నాలుగుమోములఁ దాల్చుచుండుటన్
జెలువుఁడ వైతి నాకుఁ బరిశిష్టజగమ్ముల కెల్లఁ; తాత! నీ
తలఁ పెదొ తెల్పుమీ యవితథంబుగ దాని ఫలింపఁ జేసెదన్.

## తృతీయాశ్వాసము

శ్లో॥ ఉపాసీనా నానావిధిభి రుపచారై శ్చ వివిధైః
శరణ్యాం లోకానాం శశధరకలోత్తంస మమరాః
మృషా సంధిత్సంతః ప్రకృతికుటిలై ర్దానవగణైః
విరించ స్యాదేశా దవృణుత గురుం దూత్యవిధయే.

వివిధమహోపచారముల వి స్తృతతంత్రజపాదిచర్యలన్
దివిజాలు లోకరక్షకు నుతించి భజించుచుఁ జంద్రమౌళిఁ దా
రవగుణవక్రగామిదివిజారులఁగూడ మృషార్థమైత్రిమైఁ
దివిరి విరించి తెల్పినవిధిన్ గురు నెన్నిరి దాత్యవృత్తికై.

శ్లో॥ నిస్సంఖ్యస్ఫురదుత్తరోత్తరచమత్కారాసుధారాసు తే
వాచా మత్సర మత్సరం త్రిజగతీవాగ్గర్వసర్వంకషం
శ్రోతుం లాలయితుం పునః ప్రతిపదమాధాతుం చ వా కింవిద
వ్యర్వాంచః క ఇమే వయం యది పరం దేవ స్వవాచాంనిధిః.

కలితాలంక్రియ నుత్తరోత్తరచమత్కారప్రకారమ్ముగా
నలలోకత్రయవక్తృతాగరిమ నింద్యం బౌనటుల్ పల్కఁగా
వలఁతుల్ మీనుడులన్ విసన్ మదిని సంభావింప, మాటాడ, నీ
చుల మా మా కెటు లబ్బు? వాక్పతు లటంచుం జేరు మీ దేగదా!

శ్లో॥ యుగవిగమోన్మిషద్విషమలోచనకోణపత
ద్ధుతవహవిస్ఫులింగహుతసర్వజగద్ధవిషే.
అచలధనుర్ధరాయ హరిణాంకశిఖామణయే
విజయజయైకహేతువిశిఖాయ నమో భవతే.

ప్రళయాంతప్రవిచాలితత్రిణయనప్రాదుర్భవద్భీకర
జ్వాలనప్రోత్థకణప్రదగ్ధసంకలబ్రహ్మాండహవ్యా ! విని
ర్మలశాశాంకకళాకిరీట ! హరిశర్వా! మేరుకోదండమం
డల! బీభత్సుజయైకహేతుశరకాండా! మన్నమోవాకముల్ .

శ్లో॥ శివం ధ్యాయ న్యస్తస్సకలజగతాం యచ్ఛసి శివం
శివోఽసి త్వం నామ్నా నను శివతర శ్చాసి విదితః
శివార్థీ జన్మ స్తచ్ఛివ మఖిలభావేన భగవన్ !
భవ స్తం హిత్వా న్యం శరణయతు కం న్యాయశరణః.

శివసంధానుఁడ వెల్లలోకములకున్ జేకూర్తు భక్తాళికిన్
శివముల్, నామముచే శివుండవు భవానీనాథ ! సర్వాత్మతన్
శివముం గోరెడిజంతు వెన్నటికినేర్చిన్ నిన్నుఁ దక్కన్యునిన్
జవికైనం దలపోయునే శివతరా! శంగా నమోవాకముల్.

శ్లో॥ సురాసురకరోదరస్ఖలితశైలమూలస్థల
స్థితోపలతిలాహతిక్షుభితసింధుబంధూత్థితః
భ్రమత్తిమితిమింగిలభ్రమితవారకోలాహలై
స్సమం నిఖిల మంబరం పరివవార తారస్వనః.

అమరుల్ దైత్యులు మందరాద్రి నటు త్రోయన్ శైలమూలస్థలో
త్క్రమ గండోపలసంహతిక్షుభిత పారావార తారధ్వనుల్
భ్రమమాణోచ్చతిమింగిలప్రకరబాభ్రమ్యన్మహావాలవి
భ్రమకోలాహలశబ్దముల్ పెనఁగి యభ్రస్ఫూర్తి నిండారగన్.

చతుర్థాశ్వాసము

శ్లో॥ ఉద్యన్నిర్ఘాతఘోషప్రతిభయ ముదయద్ధూమకేతూపకేతు
క్రన్దద్దిక్పాలగంధద్విప ముదధిపతత్తుంగశైలాగ్రశృంగం
ఉడ్డీనశ్యేనకంకప్రకర ముపచితధ్వాన్త ముద్భ్రాన్తవాతం
ప్రాప్తం మృత్యోరకస్మాదివ వదనబిలం విశ్వమాసీత్తదానీమ్.

బ్రహ్మాండభాండంబు పగులునట్టులు మహా
నిర్ఘాతఘోషముల్ నింగిఁ జెలఁగె
ధూమకేతూపకేతువులు మహోత్పాత
సూచకంబుగ నింగి నేఁచి పెనఁగె
గుండెలు పగిలి యుద్దండతఁ గ్రిందించు
దిగ్గజార్భటులు పెల్లగ్గలించె
గిరులు శృంగములు గిర్గిర తిర్గి వనధిలో
గుభిలు గుభిల్లునఁ గూలుచుండె

ఎగురుశ్యేనకంకములు పెల్లేర్పుచిమ్మ
చీకటులు నుడిగాలులు చెలఁగి రేఁగ
విశ్వమునకు మృత్యుముఖప్రవేశ మే మొ
యనఁగ సర్వేశ భీభత్స మై యెసంగె.

శ్లో॥ నిస్సంఖ్యస్ఫురితస్ఫులింగజటిలోత్సంగజ్వలత్పావక
జ్వాలాభంగవిటంకసంకలితధూమస్తోమభీమ స్తతః
క్రుధ్యత్కాలవికృత్తవక్త్రకుహరోన్ముక్తాట్టహాసోద్భట
స్ఫూత్కారధ్వనిభీషణః ప్రవవృతే కో౽ప్యద్భుతో మారుతః.
ఖేలోల్లోలితవిస్ఫులింగజటిలాగ్నిప్రోజ్వలత్ జ్వాలికా
మాలాభంగవిటంకసంకలితధూమస్తోమభీమంబుగా
కాలాభీలకరాళవక్త్రకుహరోద్గచ్ఛన్మహాభీకర
జ్వాలాజాలమహాట్టహాసరవలీలన్ సాగెన్ మహావాతముల్.

శ్లో॥ మ్లాయంత్యాం వై జయన్త్యామథ కనకపటే ధూసరే ధూమజాలైః
చక్రే నిర్జ్వాలచక్రే సపది పరిణతిస్ఫోటశంకే చ శంఖే
ఉత్సర్పంతీం సమంతాదపి పరికలయన్నుద్భటం కాలకూటం
కాలాత్మా పద్మనాభః మనసి వినిదధే కాలసంఘర్ష యోగమ్.
ధూమలధూమసంగతిఁ జతుర్భుజబంగరుచేల మాఁడఁ, బూ
దామము వాఁడ, శంఖము విదారణభీతిని గూడఁ, జక్ర ము
ద్దామపుఁ దేజు వీడఁ, బరితఃప్రసరన్నవకాలకూటమున్
కామము కాలరూపుఁ డిది కాలపరాభవ మం చెదం గనెన్.

శ్లో॥ భవ్యై రష్టభి రాంతరైః పరిచరన్ పుష్పై రహింసాదిభిః
కోటీరే పరభక్తిభారనమితే కుర్వన్ ప్రణామాంజలిం
వాగ్భి ర్గద్గదనిర్గతాభి రఖిలత్రయ్యంతసైద్ధాంతిక
స్తోత్రస్సారమయీభి రస్తుత సతేజ్జ్యోతిః పరంజ్యోతిషామ్.

చేతఃపీఠిగ మౌళి వంచి నతియించెద భక్తితో నాపరం
జ్యోతిర్మూర్తిని గద్గదశ్రుతిశిరస్సిద్ధాంతవాచోవిధిన్
జోతల్ వెట్టె దయాదిబాహ్యకుసుమస్తోమంబు లందిచ్చి పూ
జాతంత్రమ్ములు దీర్చి హృన్నయనకంజాతార్పణ ప్రార్థనన్.

శ్లో॥ పర్వాతంకవిశంకశంకరజటాలంకారచంద్రాంకుర
జ్యోత్స్నానిర్భరపూరితత్రిజగతీగర్భావధూతో బహిః
నః శ్వేతః క్వచ న వ్యలీయత మహాశుండాలశుండాహతి
క్షుభ్యత్ క్షుద్రసరస్తరంగనికరవ్యాకీర్ణశైవాలవత్.

అన్నిభయంబులం దొలఁచునట్టి మహేశుని కొప్పులోనియా
క్రొన్నెలవెన్నెలల్ కనరికొట్టఁగ లోకబహిష్కృతస్థితిన్
నన్నకసన్న జాత్రె విషసారము, మత్తమతంగతుండనం
ఛిన్నతఁ జెఱ్ఱులోఁ జెదరి పీలికలై పడునాచుకైవడిన్.

## పంచమహాశ్వానము

శ్లో॥ ఆపోశ్ని రంహసా గచ్ఛ స్నానార్థ్యే మారుతేన యః
సైంధవ స్సైంధవా ద్గర్భా దుత్తతార సపాండరః.

గీ॥ ఆవ్యమై యున్నఁదాను సనాప్య మగుచు
నాశుగునికినిగూడ సనాప్య మగుచు
తెల్ల నగుసైంధవము తేటతెల్లముగను
సైంధవోదరమందుండి చక్క వెడలె.

శ్లో॥ కపోలా నిర్మాతుం కిల శకల మేకం హిమరుచే
యదాదా యాత్యక్షి దసము మిద మస్యా ఇతి విధిః
తదాసీ దాశ్చర్యం పరమ మఖిలానాం దివిషదాం
తదుత్తంసీభూతం పురమథితు రద్యాపి మకుటే.

హరిహరదేవాయ నమః

# అన్యోక్తి ముక్తావళి

శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి.

ఉ. శ్రీరమణీయమై జడము చేతనమై పురుషుండుఁ గాంతయై
భూరిసుఖంబు దుఃఖమును బొందుచు నామము రూప మూని సం
సారము మీఱఁ బుట్టుచును జచ్చుచు నున్నటు నోఁచు వాఙ్మనో
దూరవిశుద్ధధామ పరితోభరితంబు రహించు నేకమై.

ఉ. సంతస మందెదీ దృణ మొసంగినమాత్ర వినాయకుండు; కా
వంత నుతింపకే జననిదాఁటఁ బ్రసన్నత నూను వాణి; న
న్నింతటివానిఁ జేసినయహేతుదయోదయుఁ డాయుమారమా
కాంతుఁడు మామకీనుఁడె; జగాన మదన్యుఁ డెవండు మ్రొక్కఁగన్.

మ. పరహాస్యం బగునాత్మకీర్తిసుధ నాస్వాదించితిన్, కావ్యముల్
పరికల్పించితిఁ బ్రౌఢిమై రసికవిద్వాంసుల్ ప్రశంసింప, మేల్
బిరుదుల్ గొంటిని; ఘంటికాశతక ముద్వేల ప్రథం గొంటి, నీ
పరమాపారకృపారసైకధుర గీర్వాణాంధ్రవాగ్దేవతా!

మ. పితృపాదోచ్చరితంబుఁ బండితమహావృద్ధాస్యలబ్ధంబు, ము
ద్రితకావ్యాంతరితంబు, నీతివచనాధిష్ఠానమై పొల్పుపం
డితరాజోదితచాటుపద్యచయ మెంతే నొక్కెడం జేర్చి నే
నతికౌతూహలలీల జాలుకొనఁగా నాంధ్రీకరింతున్ వెసన్.

మ. ఎవఁ డంచద్రసవత్ప్రసాదగుణ మెంతే శయ్యదై వాణి, మా
నవసంఘాంతరదుర్గుణావళి నవన్యప్రౌఢి నన్యాపదే
శవిధిన్ సత్కవితన్ ఘటించి కడు నిష్కాసించెఁ; నాసారస
త్కవితాశ్రీనిధి యాంధ్రసన్మణి జగన్నాథుండు సామాన్యుఁడే!

క. స్రష్ట నవమధురకవితకు
ద్రష్ట సకలశాస్త్రసత్పురాణాళి, కువ
ద్రష్ట జగన్నాథునకున్
విష్టపమున సాటి యగుకవిం గనఁగలమే ?

ఉ. గండరగండఁడై పుడమిఁ గల్గినకర్కశతర్కపండితా
ఖండలపాళి నిర్జితులు గాఁగ నలంకృతిశాస్త్రకర్తృస
న్మండలిగుండియల్ సెదర, మానితశాబ్దికులుం గలంగ నుం
గండనివాసి నాఁడు కడు గండుకొనెన్ భరతావనీస్థలిన్.

చ. కరినగరీవరుండు గుణగణ్యుఁ డుదారుఁడు యావనావనీ
శ్వరుఁ డగు "షాజహాన్" నృపతి సర్వసపర్యల నంతరించుచున్
గురుతరభక్తియుక్తిఁ దనకుం దమిఁ "బండితరాజ" నా మహా
బిరుద మొసంగ మేటిలు నవేలకలాలనమానుఁ డల్పుఁడే?

మ. కవితాలాలసతాబలాత్కృతికి లోఁగన్నాగియే కాని త
త్కవిరాజానుపమానహృద్యతరపద్యశ్రేణి నాంధ్రీకరిం
ప వశంబా! యొకపాటిపండితునకున్? వాగ్దేవతామూర్తి నే
కవిమూర్ధన్యుఁడు నమ్మి యిప్పనికి సంకల్పించెఁగా కిమ్మెయిన్.

ఉ. మామకవంశకర్త సురమాన్యుఁడు కశ్యపహాని; వైద్యపు
త్రాముఁడు బాపనార్యుఁడు పితామహుఁ; డార్జవధర్మవర్తి వి
ద్యామయమూర్తి యొజ్జయును దండ్రియు వేంకటరాయపండితుం
డామహిమాన్వితాన్వయమునం దుదయించుట సాహసించితిన్.

క. కవికంఠీరవ, విద్వ
త్కవివర, బోధకవిచంద్ర, కవిమూర్ధన్యాం
కవినుత కాకరపర్త్య
న్వవాయభవకృష్ణశాస్త్రిభట్టారకుఁడన్.

చ. వనుఁ గడుఁ బ్రోత్సహింపుఁ డభినంద్యరసజ్ఞకవీంద్రశేఖరుల్!
వనితకు భాషితంబు లిడి; లౌల్యము కేవల మోలగింప నే
దెసఁ గొసరింపఁగా దివిరితిన్ దనిఁ బండితరాజచాటువుల్
ఘనుఁడ నటంచుఁ గాదు, ధనకాంక్షయు లేదు యశోర్థిఁ గానయా!

## 1. భృంగము

శ్లో. భ్రమర! భ్రమతా దిగంతరాళే
క్వచి దాసాదిత మీక్షితం శ్రుతం వా
వద సత్య మపాస్య పక్షపాతం
న హి జాతీకుసుమానుకారి పుష్పమ్.

తే.గీ. తిరిగినాఁడవు దశదిశాంతరములందు
భ్రమరమా! కంటివా వింటివా రవంత
యేని జవిఁగొంటివా జాజి నెనయు పూవుఁ
బక్షపాతంబు లేకుండఁ బలుకుమయ్య!

శ్లో. కిం మాలతి! మ్లాయసి మాం విహాయ
చుచుంబ తుంబీకుసుమం షడంఘ్రిః
లోకే చతుర్భి శ్చరణైః పశు స్స్యాత్
న షడ్భి రత్యర్థపశు ర్న కిం స్యాత్

ఉ. "పోలునె షట్పదంబు సరపూవును ముద్దుఁ గొనంగ" నంచు నో
మాలతి! యేటి కిట్టు లవమానభరంబునఁ జిన్నవోవుటల్
నాలుగుపాదముల్ గలిగినన్ పశు వౌ ధర నాఱుకాళులన్
దాలిచి యుంటచేఁ బశువు తా నయి పై నరయై యెసంగదే!

శ్లో. పంకజజన్మా మధుప
స్సురతరుకుసుమేషు పీతమకరందః
దైవా దవని ముపేతః
కొటజకుసుమే సమీహతే వృత్తిమ్.

తే.గీ. నందనవనాంతరమున జన్మంబుఁ గాంచి
నాకధరణీజసుమమరందమ్ముఁ గ్రోలి
దుర్విధివిపాకమున నళి యుర్విఁ జేరి
యకట! కుటజలతాంతమం దాన గొనియె.

శ్లో॥ నీలతయా స్థూలతయా
దూరతయా దానలోలుపై ర్మధుపైః
ధావిత మిభరాజధియా
హన్తాసీ ద స్తతో మహిమః.

ఉ॥ నీలతఁ గాంచి స్థూలత గణించి సుదూరతచేతఁ బోల్పఁగాఁ
జాలక దానలాలసత జాలుకొనంగ మిళిందబృంద మ
త్తాలజవంబునం జనె మతంగజ మంచు భ్రమించి యేమనం
జాలుదు మమ్మచెల్ల! మహిమం బది యయ్యో గమించి కాంచఁగన్-

శ్లో॥ పూర్వం కల్పతరుప్రసూనమదిరాస్వాదేన సంమోదినీ
దీవ్యద్దివ్యతరంగిణీకమలినీ ప్రేంఖోలికాఖేలినీ
దైవా దద్య మహీతలే మధుకరీ నిష్పాత్రపుష్పేచ్ఛయా
భ్రామ్యంతీ కృకలాసవక్త్రకుహరం హా! హన్త! సంగాహతే.

చ॥ అమరతరుప్రసూనమదిరానిశమోదిని నై సురాపగో
త్తమనళినీసుడోలిక నిశాంతము ఖేలన మాచరించు నా
భ్రమరి యభాగధేయత నిపాతను మేచ్ఛ పెనంగొనంగ లీ
ల మహిఁ భ్రమించి నిండి కృకలాసవశద్వదనంబునన్ బడెన్.

శ్లో॥ ప్రారంభే కుసుమాకరస్య పరితో యస్యోల్లసన్మంజరీ
పుంజే మంజులగుంజితాని రచయం స్తా నాతనో రుత్సవాన్
తస్మి న్నద్య రసాలశాఖిని దశాం దైవా త్కృశా మంచతి
త్వం చే న్మంచసి చంచరీక! వినయం నీచ స్త్వదన్యో ఽస్తి కః.

ఉ॥ మంజులగుంజితంబు లసమానగతిం బచరించి మంజరీ
పుంజములన్ వసంతమున మున్ రచియించితి వుత్సవంబులన్
నెంజిలి నందె దైవవిధి నేఁడు కృశించి రసాలశాఖ; పా
యం జన వోయి భృంగ! భవదన్యుఁడు నీచుఁ డెవండు వాసినన్.

శ్లో॥ ఇహ రూపమాత్రసారే
కాసారే చిత్రభాజికల్హారే
న రసో నాపి చ గంధో
మధుకరబంధో! వృథా భ్రమసి.

తే.గీ॥ మానితమనోహరాకారమాత్రసార
చారుకాసారకల్హారసరణిఁ గాంచి
పటమునందు వృథా భ్రాంతిపడకు భృంగ!
లేదు రస మిందు గంధంబు లేదు లేదు.

శ్లో॥ నీరజా న్యపి నిషేవ్య నిర్భరం
తీరజాని కుటజాని వాంఛసి
చంచలత్వ మిహ చంచరీక! తే
సాహజం కథ మిదం విమోక్ష్యసి.

క॥ నీరజము లనుభవించియుఁ
దీరజకుటజములఁ గోరి తే మధుకరమా!
ఏరా! సాహజచంచల
తారంభము వాయఁజాలవా యే వేళన్.

శ్లో॥ ఉపావీతం దూరా త్పరిమళ ముపాఘ్రాయ మరుతా
సమాయాసీ దస్మిన్ మధురమధులోభా న్మధుకరః
వరం దూరే లాభః కుపితఫణివ శ్చందనతరోః
పున ర్జీవం యాయా ద్యది త దిహ లాభో౽ య మతులః.

మ॥ మరుదానీతపరీమళంబులను సంపాదించి యిందిందిరం
బరుమారందనికామకామమున నయ్యో! వ్రాలెఁ గుప్యత్ఫణీ
శ్వరయుక్చందనశాఖిశాఖనయి; లాభప్రాప్తి కేమాయెఁ బో
వరలాభం బగుఁ గాదె ప్రాణములతో బైటం బడంజాలినన్.

శ్లో॥ భ్రాన్తి ర్భ్రామ్య లవంగవల్లిషు పిబ స్వైరం నవాంభోరుహే
మాధ్వీం మాధవికామధూని మధురా ణ్యాకంఠ మాస్వాదయ
కస్మా దాపతితో ఽసి కేతక మిదం యస్మి న్నుదీర్ణం రజో
నేత్రే భిందతి కంటకాః ప్రవితతాః కృంతంతి మర్మా ణ్యపి.

మ॥ సరసీజమ్ముల మాధ్విఁ గ్రోలుము యథేచ్ఛం బాలవంగావలిన్
బరువుల్ వెట్టుచు మాధవీయమధు వాస్వాదింపు మాకంఠ మో
వరభృంగా! యిటు కేతకీవనముపై వ్రాలంగ నేలా? రజో
భరముల్ కన్నుల నేచవా? చినిగిపోవా? మర్మముల్ ముండ్లచేన్.

శ్లో॥ నాలింగితా నవలవంగలతా నవాపి
సంభావితా శ్చ విటపాః కలగుంజితేన
ఆసాదితా నపది కా చ న గీతి రన్యా
మాకందకోరక ముదీక్ష్య మధువ్రతేన.

తే. గీ. అనుపమరసాలకోరక మరయుకతన
నళివరుఁడు సుంత నవలవంగలతఁ జేరి
కౌఁగిలింపఁడు కొమ్మలఁ గలరవమున
గారవింపఁడు పాడఁడు చారుగీతి.

శ్లో॥ కిం న పశ్యసి మహేంద్రదిఙ్ముఖే
శీతదీధితి రసా వుదంచతి
మీలితైవ నళినీహ మా కృథా
స్త్వ న్మధువ్రత! ముధా పరిశ్రమమ్

ఉ. శీతఘృణీగణమ్ము విరజిమ్ముచుఁ దూరువునందుఁ జందురుం
డీతరుణమ్మునందు నుదయించుచు నుండుటఁ జూడకుంటివే
యాతప వేళరా? వృథగ నానళినీమణి దీనదీన యై
మూతి బిగించుకొంచుఁ గడుమూకతఁ గ్గై కొనెరా మధువ్రతా!

శ్లో॥ అళి రసౌ నళినీకులవల్లభః
కమలినీహృది కేళికృతాదరః
విధివశా త్పరదేశ ముపాగతః
కుటజపుష్పరసం బహుమన్యతే.

తే. గీ. ఫుల్లనళినీకులప్రాణవల్లభుండు
కమలినీచిత్తఖేలనాకలితరతుఁడు
అళి విధికి లోఁగి పరదేశమందుఁ గుటజ
పుష్పరసమున నాసక్తిఁ బూనినాఁడు.

శ్లో॥ ప్రిబంధనం పద్మవనే నిశాయాం
మాతంగదానే మదకర్ణ తాళైః
స్వప్రాణభంగః ఖలు చంపకే ఽస్మిన్
సర్వత్ర దుఃఖం భ్రమరస్య లోకే.

చ. జలజవనాంతరంబున నిశన్ వసియింపఁగ బంధనమ్మె, మాం
సలగజదానధారఁ గొనసాగెడువేళలఁ గర్ణతాడనం
బులె, యలచంపకంబుదెసఁ బోవఁగ బ్రాణభయంబె మాటికిం
గలుగుచునుండు; దుఃఖమె జగాన సదా భ్రమరాళి కెయ్యెడన్.

శ్లో॥ అపసర మధుకర! దూరం
పరిమళబహులేఽపి కేతకీకుసుమే
ఇహ న హి మధులాభ స్తే
భవతి పరం ధూళిధూసరం గాత్రమ్.

చ. మధుకర! దవ్వులం దొలఁగుమా మదిలో భ్రమఁజెందఁబోకుమా
పృథులపరీమళాదిలిత మీానవ కేతకి యంచు, నిచ్చటల్
మధురసలేశ ముున్న దనుమాటయె లేదుర, నీవతాంగ మ
త్యధికము ధూళిధూసరిత మౌను జుమీా వయిపెచ్చు చేరినన్.

శ్లో॥ దృష్ట్వా హృష్టోఽభవ దళి రసా చిత్రసంస్థే చ పద్మే
వర్ణం రూపం కి మితి కి మితి వ్యాహర న్నాజగామ
నాస్మిన్ గంధో న చ మధుకణో నాస్తి తత్సౌకుమార్యం
ఘూర్ణన్ ఘూర్ణ న్నవనతముఖో వ్రీడయా నిర్జగామ.

చ. అళి యొకచిత్రచిత్రఫలకాంతరవారిరుహంబుఁ గాంచి తోఁ
బలుమరు వర్ణరూపములవైఖరి మెచ్చుచుఁ జేరి .వాసనా
కలితతఁ గాని, కోమలత గాని, మరందకణంబు గాని, యం
దులఁ గనలేమి సిగ్గున నధోముఖుఁడై రొదసేయుచుం జనెన్.

శ్లో॥ యే వర్ధితాః కరికపోలమదేన భృంగాః
ప్రోత్ఫుల్లపంకజరజస్సురభీకృతాంగాః
తే సాంప్రతం ప్రతిదినం గమయంతి కాలం
నింబేషు చార్కకుసుమేషు చ దైవయోగాత్.

చ. కరివరగండభాగములఁ గారెడు దానవితాంతధారలన్
బెరుఁగుచు, నంగముల్ వికచనీరజవారపరాగసంగతిన్
బరిమళమేళనంబుఁ గని వాసిలఁ బొంగెడుభృంగముల్ విధి
న్నిరతము గాలముం గడుపు నింబము నర్కము నాశ్రయించుచున్.

శ్లో॥ మధూకే మార్ద్వీకం పిబసి శతపత్రేఽభిరమసే
మధూళీపాళీభి ర్మధుప! సహకారే విహరసే
వనం తే వాసంతీమధు మధుర మశ్నాసి బహుశో
దురావేశోఽయం తే తదపి కుటజే య ద్విహరసే.

మ. ఘన మాకంద మధూకమందు విపులన్ మాధ్వీకముం గ్రోలి, కే
ళీ సహా! తేలి పయోరుహంబున మధూళీపాళితోఁ దియ్యమా
వినిఁ గ్రీడించి వసంతమందు, మధులబ్ధిన్ మాధవిన్ వ్రాలి యీ
లినసీకున్ మధుపా! యివేల కుటజప్రీతుల్ దురావేశముల్ ?

శ్లో. పీత మత్ర మధు యాపితా క్షుపా
భృంగ! సర్వ మచిరేణ విస్మృతం
హీయమానసుమనాం హిమాగమే
పద్మినీం య దిహ నావలోకసే.

చ. మును మనుకొన్న మోదమునఁ బుచ్చితి వెన్నియొ రాత్రులిందు తీ
యని మధు వానుచున్ మఱపు నందితివే సకలమ్ము నింతలో
ననేఃఘన మాహిమాగమమునం గడుఁ జెన్ను దొఱంగి యున్నప
ద్మినిదెస నొక్కమాఱయినఁ దేరి కనుంగొనవేమి భృంగమా!

శ్లో. గళితాని మధూని సర్వతః
పరికీర్ణాని దళాని మారుతైః
అధునాపి న హంత! మాధవీం
మధు పై తా మిహ నావలంబసే.

తే. సరసమధువులు పూర్తిగా జాఱిపోయె
మృదులదళములు గాలిచేఁ జెదరిపోయె
మధుప! యిప్పుడుగూడ యీమాధవి నిటు
లయ్యయో పట్టుకొని ప్రాఁకులాడ దేల!

శ్లో. చంచరీక! చతురోఽసి చంద్రికా
వైభవే కుముదినీం నిషేవసే
భాస్కరే జయతి పుష్కరే కరై
రున్మిష న్నవదళేఽనురజ్యసి.

ఉ. కమ్మనిపండువెన్నెలలు గాసెడు చల్లనివేళలందుఁ జి
త్తమ్మిగురొత్తఁగాఁ గలువదాపునఁ జేరి సుఖింతు వెంతయున్
గ్రమ్మినభానుకాంతుల వికాసము నందుచు ముద్దులొల్కఁగనె
త్తమ్మి రమింతు; బల్చతురతన్ గలవాఁడవు చంచరీకమా !

శ్లో. మరందలోభా చ్ఛ మిళిందమాలా
భేజేఽంబుజం సూర్యకరై ర్విభిన్నం
హా! హంత ! నాళీక మిదం దురంతం !
ప్రాలేయపాళీ ముకుళీచకార.

తే.గీ. సవితృకిరణౌఘమున వికాసంబునందు
నంబుజాతంబులో మరందంబు నందు
కోసఁగ నిందిందిరంబులు సనఁగ నకట!
హీఁక హిమ మబ్జమును ముకుళీకరించె.

శ్లో. అమరతరుకుసుమసౌరభ
సేవనసంపూర్ణ సకలకామస్య
పుష్పాంతరసేవే యం
భ్రమరస్య విడంబనా మహాత్.

తే.గీ. అమరధరణీజ సుమసౌరభాతిమాత్ర
సేవచేఁ బూర్ణ వాంఛితసిద్ధిఁ గనిన
భ్రమరమున కన్యకుసుమసేవనము వలన
నమితతమ మా విడంబనం బగును గాదె.

శ్లో. యావ దేనం న జానాతి
పారిజాతం మధువ్రతః
తావ ద్భ్రమణ మేవాస్య
కుంజే కుంజే ద్రుమే ద్రుమే.

తే.గీ. సారమకరందకణజాత పారిజాత
మెంతదనుక యెఱుంగదో యంతవఱకె
కుజకుజంబుసకున్ గుంజకుంజమునకుఁ
బరుగు లిడుచుండు నీమధుకరము కరము.

శ్లో. పురందరపురే పురా రుచిరకానసే నందనే
నిపీయ మధురం మధు ప్రకటితారవో యో భవేత్
ప్రశుష్కగళతాలుకో గళితమంజులాలాపకః
స ఏవ మధుపో ఽధునా బదరికారసం కాంక్షతి.

చ. భ్రమరము మున్ను సుందరపురందరనందనమందు సన్మరం
దము దమి నారగించుచు సుధామధురధ్వనిఁ జిమ్మె నేఁడు తాఁ
దమకము వాయ శుష్కగళతాలుక యై పరిపన్నతన్నినా
దమునఁ జరించుచున్నది గదా బదరీరసపానలోల యై.

శ్లో. గంధాఢ్యా సా జగతి విదితా కేతకీ స్వర్ణవర్ణా
పద్మభ్రాంత్యా రసికమధుపః పుష్పమధ్యే పపాత
అంధీభూతః కుసుమరజసా కంటకైః ఛిన్నపక్షః
స్థాతుం గంతుం క్షణ మపి సఖే! నైవ శక్తో ద్విరేఫః.

ఉ. గంధము స్వర్ణవర్ణమును గల్గి జగద్విదితంబు నౌటఁ బు
ష్పంధయ మొండు పద్మ మనుభ్రాంతిని గేతకిలోన దూరి తా
నంధత గాంచి తద్రజము లంటుటఁ గంటకభిన్నపక్షమై
బంధురదుఃఖ మంది నిలువం జనఁజాలక పోయె మిత్రమా!

శ్లో. నిషీదతు శిరీషకే చరతు వా కదంబే చిరం
సముత్పతతు పంకజే కురవకే కరోతు స్థితిం
దినం నయతు కుందకే నను రసాల! కాలక్రమా
న్న విస్మరతి కేవలం తవ గుణా దసౌ షట్పదః.

చ. చిరము శిరీషమందు నివసించెదుఁ గాక, కదంబమందు సం
చరణము సల్పుఁగాక, జలజంబున వ్రాలెదుఁగాక, లీలమై
కురవక మెక్కుఁగాక, నవకుందములన్ దిన మేయుఁగాక తా
మఱవదు నీగుణంబు లణుమాత్రము షట్పద మోరసాలమా!

శ్లో. మలినేఽపి రాగపూర్ణాం
వికసితవదనా మనల్పజల్పేఽపి
త్వయి చపలేఽపి చ సరసాం
భ్రమర! కథం వా సరోజినీం త్యజసి.

చ. మలినుఁడ వైన రాగ మనవానముగాఁ జిలికించె; నెంతగా
బలుమరు పేలిననే వికచభావమునే మొకమందుఁ దాల్చె;చా
పలత యదెంత నీయెడల భాసిలినన్ సరసత్వ మూనె; న
ట్టులు భ్రమరా! సరోజినిఁ గడు న్విడువన్ మనసొప్పెఁజెప్పరా?

శ్లో. భృంగః క్షుధాళు రపి కింశుకవిభ్రమేణ
వ్యాజృంభమాణశుకచంచుపుటం ప్రవిష్టః
ఆశాం విహాయ మధునోఽ వయమైవ సమగ్ర
న్నిర్గంతు మిచ్ఛతి పరం పరితప్యమానః.

చ. శుకపరిజృంభమాణతతశోభితచంచుపుటాంతరంబుఁ గిం
శుక మనుభ్రాంతి నొక్కయళి సొచ్చె క్షుధాధికబాధ రేఁగగా
నకటకటా! సమగ్రముగ సంగకముల్ సలుగంగఁ దేనెపై
నిఁక నడియాన వీడి వడి నేగఁ దలంచె మదిం గడుంగడున్.

శ్లో. చర న్వనాంతే నవమంజరీషు
న షట్పదో గంధఫలీ మజిఘ్రత్
సా కిం న రమ్యా స చ కిం న రంతా
బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా.

తే. గీ. పుష్పవని మంజుమంజరీపుంజమందు
మలయు నళి గంధఫలి వంట మానుటేల?
రంత తాఁ గాదో? యయ్యది రమ్య గాదో?
ఎంత బలవంత మైనదో యీశ్వరాజ్ఞ!

శ్లో॥ కుసుమాని లిఖంతు నామ చిత్రే
నతిచిత్ర్యాలపశేవరూఢశిక్షాః
సురభిత్వ మమూని కిం లభంతే
కథ మేతేషు రసం పిబంతి భృంగాః.

తే.గీ. క్రిమనుశిక్షితు లౌచిత్రకారు లెల్లఁ
జిత్రమునఁ బుష్పములను విచిత్రలీల
వ్రాయుదురుగాక కలుగునే పరిమళంబు
తేనె లెటులాను నందు నిందిందిరములు.

శ్లో॥ సముపాగతవతి దైవా
దవహేలాం కుటజ! మధుకరే మా గాః
మకరందతుందిలానా
మరవిందానా మయం మహామాన్యః.

తే. గీ. దుర్విధివిపాకకలన మధువ్రతంబు
చేరె ని,న్నవహేళనసేయఁబోకు
మిది సదా మాననీయమైనది కుటజమ!
భూరిమకరందతుందిలాంభోజములకు.

శ్లో॥ యే నామందమరందే
దళదరవిందే దినా న్యనాయిషత
కుటజే ఖలు తే నేహా
తేనే హా! మధుకరేణ కథమ్.

తే.గీ. సుందరామందమకరందమందిరార
విందమందు దినంబులు వెడలఁబుచ్చు
మత్తపుష్పంధయం బెల్లు చిత్తగించు
కుటజకుజమును గోరిక పాటమరింప.

శ్లో॥ అపనీతపరిమళాంతర
కథే పదం న్యస్య దేవతరుకుసుమే
పుష్పాంతరేఽపి గంతుం
వాంఛసి చేద్ భ్రమర! ధన్యోఽసి.

క. దూరీకృతపరసౌరభ
సారతరూత్తమలతాంతసంతతిఁ బదముల్
సారించునీ కితరసుమ
వారరతి రహింప ధన్యభవుఁడవ భ్రమరా!

2. చాతకము

శ్లో॥ వృథా ముధా ధావసి చాతక! త్వం
నాయం ఘనః కింతు కరీ మదాంధః
న త్వాదృశేభ్యో విదదాతి దానం
మాతంగదానం మధుపేభ్య ఏవ.

తే.గీ. కడు వృథగ చాతకమ! పరుగిడెద వేల?
ఘనుఁ డితఁడు గాఁడు సుమదాంధకరియె కాని
తాను మీబోంట్ల కెన్నఁడు దాన మీఁడు
మత్తమాతంగదానంబు మధుపతతికె.

శ్లో. రేరే చాతక! సావధానమనసా మిత్రిం! క్షణం శ్రూయతాం
అంభోదా గగనే వసంతి బహవ స్సర్వేఽపి నైకకరిమాః
కేచిద్ వృష్టిభి రార్ద్రయంతి ధరణీం కేచిద్ వృథా గర్జతే
యం యం పశ్యసి తస్య తస్య పురతో మా బ్రూహి దీనం వచః.

మ. వినరా చాతక! సావధానమతి వై వేవేలు నైకక్రమం
బున నాకాశపథంబునన్ వెలయు నంభోదంబు లీధారుణిన్
దనుపుం గొన్ని సువృష్టిచేత వితథోద్దండైకగర్జార్భటిన్
దనరుం గొన్ని, నదీనతం గనినమాత్రన్ వేడఁబో కన్నిటిన్.

శ్లో. ఏక ఏవ ఖగో మానీ
చిరం జీవతు చాతకః
పిపాసయా వా మ్రియతే
యాచతే నో పురందరమ్.

తే.గీ. చాతక మ్మొక్కఁడే ఖగజాతమందు
మాని యగు; నది దీర్ఘాయు వూనుఁగాక
పాయునే కాని యనువు పిపాసచేత
దేవతాపతినైన నర్థింపఁ బోదు.

శ్లో. చాతకేన తృషితేన యదంభో
బిందుమాత్ర మమలం పరిలబ్ధం
దైవత స్తదపి వాతనిపాతా
దస్యతః పతిత మాస్య మపాస్య.

తే.గీ. అతితృషార్తచాతకపోతమునకు
జలవిమలశీకరం బొందు గలిగెఁ గాని
దైవదుర్యోగకలన వాతహతి నదియు
వివృతచంచూపుటమునుండి వెలికి జాఱె.

శ్లో. వాపీ స్వల్పజలా సరో బిలసమం నీచావగాహో హ్రదః
స్వచ్ఛస్వాదుసుశీతలో త్రిపథగా వైకుంఠపాదాగ్రజా
నీచః క్షారతరో మహాన్ జలనిధి ర్గండూషమాత్రం మునేః
తస్మాన్నీ ఖలు చాతకో జలముచా ముచ్చైః పయో వాంఛతి.

సీ. కోకదాంపత్యసౌఖ్యాకరంబయ్యును,సీతావగాహమై నెగడుహ్రదము
శీతలామలజలోపేత దా నయ్యును, శౌరిపాదాగ్రిజ జహ్నుతనయ
అమితమయ్యునుసీచమైక్షారమైవమౌని,గండూషమాత్రమైయుండువనధి
జలజావళీపరిమళలాలితం బయ్యు, బిలసమానం బయి వెలయు సరసి

తే.గీ. అతితరాల్పోదకంబుచే నమరు వాపి
సుందరోరుఘనాఘనస్యందమాన
మానితోచ్చైర్జలంబునే తాను గోరు,
చాతకం బెంతియభిమానియో తలంప.

శ్లో. కే వా న సంతి భువి వారిరుహావతంస
హంసావళీవలయినో జలసన్నివేశాః
కిం చాతకః ఫల మపేక్ష్య నవ్యజపాతాం
పౌరందరీం కలయతే నవవారిధారామ్,

మ. సరసీజంబులచేత సంచగమిచే జానొందు మేలౌనరో
వరముల్ ధారణి నెన్ని లేవు! బలభిద్వజ్రవిహాతై కదు
ర్భరసంరంభవిజృంభమాణజలధారల్ జాతకం బెంతయుం
బరమాసక్తిని గోరు నేఫలితముల్ వాంఛించియో కాని తాన్.

౮. పిచ్చుక

శ్లో. గిళితగరళకంఠ శ్శంకరో నీలకంఠః
ప్రబలతరవిషాళీ బర్హిణో నీలకంఠః
అజిరతృణవిసర్పత్కీటదర్పాపహారీ
కలయసి కలవింక! త్వం చ భో నీలకంఠః

చ. గరళముఁ దా గళంబున జగంబుల రక్షణసేయ నిల్పుశం
కరుఁడును నీలకంఠుఁడె; సగంధవిషాహి గ్రసించు కేకియుల్
అరయఁగ నీలకంఠుఁడె; తృణాచితకీటకదర్పహారి నా
బిరుదువహించి మించుకలవింకమ! నీవును నీలకంఠమె!

## 4. కాకము

శ్లో. కరోతు కరట శ్శబ్దం
సర్వదా ప్రాంగణే వసన్
న శృణోతి బుధః ప్రీత్యా
శృణోతి పికభాషితమ్.

క. వాకిలిలో నివసించుచుఁ
గాకం బనిశంబు గట్టిగాఁ దా నఱచుం
గాక; వినఁబోఁడు బుధుఁ; డా
కోకిలకలరవమె వినఁగఁ గోరున్ బ్రీతిన్

శ్లో. విధి రేవ విశేషగర్హణీయః
కరట! త్వం రట క స్తవాపరాధః
సహకారతరౌ చకార య స్తే
సహవాసం సరళేన కోకిలేన.

తే. గీ. సరళ మగుకోకిలముతో రసాలమందు
నీకు సహవాస మొనరించి నింద్యుఁ డయ్యో
నావిధియె; నీదు నేర మావంత లేదు
వాయసమ! ప్రేలుకొను మిచ్చవచ్చినట్లు.

శ్లో. నీలం వపు ర్వహతు చుంబతు సత్ఫలాని
రమ్యేషు సంచరతు చూతవనాంతరేషు
పుంస్కోకిలస్య చరితాని కరోతు నామ
కాకః కలస్వనవిధౌ నను కాక ఏవ.

చ. లలితవిలాసచూతవనులన్ మిగులన్ విహరించుఁగాక స
త్ఫలము భుజించుఁగాక పరిదర్పితనీలతనూవిభాసి యై
కులికినఁ గుల్కుఁగాక మగకోయిలఁ బోలెడుఁగాక యన్నిటన్
గలవరపంచమస్వరవికల్పనఁ గాకము కాకమే కదా.

శ్లో. ప్రత్యంగణం ప్రతితరు ప్రతివారితీరం
కాకా శ్చరంతి చలచంచుపుటా రటంతి
నో యాంతి తృప్తి మథ మండితపుండరీక
షండే చర న్నపి న తుష్యతి రాజహంసః.

చ. ప్రతితరువారమందుఁ బ్రతివారిమనోహరతీరభూములన్
బ్రతివిమలాంగణంబుల విరావము మీఱఁ జరించుఁ జంచుసం
తతి మితిమీఱఁ జూచుకొని; తాల్పవు కాకు లొకింతతృప్తి; మం
డితతతపుండరీకములనే కనుఁ దుష్టిని రాజహంసముల్.

శ్లో. కిం కేకీవ శిఖండమండితతను శ్శారీవ కిం సుస్వరః
కిం వా హంత! కపోతబాలపికవ త్కర్ణామృతం స్యందతి
కిం వా హంస ఇవాంగకుందధవళః కిం కీరవ త్పాఠకః
కాకః కేన గుణేన కాంచనమయే సంస్థాపితః పంజరే.

శా. శారీవై ఖరి సుస్వరాంచితమొ, హంసంబట్లు మల్లీసితం
బో, రాకీరముఠీతిఁ బాఠకమొ, కాపోతమ్ము పైకమ్మటుల్
గారంజేయునొ మాధురిన్, నెమలిజోకన్ సచ్ఛిఖండాఢ్యమో
ఏరీతిన్ మణిపంజరోదరమునం దీకాక ముంపంబనున్?

శ్లో. కరట! కలకంఠశాబక
మేనం పుష్ణాసి కిం ముధాయాసైః
ఇయా మిహా పురా సపక్షః
పరిచయ మపి తే న జానీతే.

చ. మురిపెము లోఁ జెనంగొన విమోహితచిత్తము బిత్తరింపఁగా
కరటమ! పెంపనేల వృథగా నిటు లీకలకంఠపోతమున్
కర మిది నీకొలంబునకు నాఁడును నేఁడు విపక్షపక్షి, నీ
పరిచితి నెంతమాత్రమును భావనసేయక యున్నదే సుమా.

## 5. కోకిలము

శ్లో. రేరే కోకిల! మా భజ మౌనం
కించి దుదంచయ పంచమరాగం
నోచే త్త్వామిహ కో జానీతే
కాకకదంబకపిహితే చూతే.

తే.గీ. మౌనమును మాని కోకిలమా! రవంత
ప్రస్తరింపుము పంచమరాగకలన
కానిచో ని న్నెవం డెఱుఁగంగ నేర్చు
కాకసంకులతీరసహకారశాఖ.

శ్లో. ధ్యాయ న్నంజనతోయబుద్బుదకణప్రాయం స్వయం మస్తకం
పశ్య న్నాయసకూటకోటిఘటితక్రోటీపుటం వాయసం
న స్థాతుం న పలాయితుం న చలితుం నోన్మీలితుంమీలితుం
నో మర్తుం న చ జీవితుం స భవతి త్రాసాకులః కోకిలః.

ఉ. కాకము దాల్పు నాయినుపకారును మీఁజెపముక్కుఁ జూచి త్రా
సాకులకోకిలంబు తనయంజనజీవనబుద్బుదాభశీ
ర్షాకృతి నెంచి యొప్పె నకటా! కనలేక మొగుడ్పలేక పో
లేక వసింపలేక మనలేక చలింపఁగలేక చాకయున్.

శ్లో. సంత్యజ్య కోకిలశిశో! మధురప్రవాళం
మాకందబృంద మళిపోతమిళత్ప్రసూనం
నింబే తు తిక్తహృదయే బలిభుక్కులాఢ్యే
మౌనేః పతిష్యసి యదీహ వదాశు కార్యమ్.

చ. అళిమిళితప్రసూనమయి హాటకిపాలయభాసమాన మై
వెలయు రసాలసాలమును వీడి యదేమో! పలుగాకిమూకతో
నలరి నితాంతతిక్తవిరసాంతరముం గొనునింబ మేలరా
కొలిచెదు మౌనమూని యిటు కోకిలబాలక! కార్య మేమిరా?

శ్లో. వపు ర్మలిన మీదృశం తదపి పుష్ట మేత త్పరై
శ్శకుంత ! బత ! సంతతం శకునిభి ర్వనే ధావసి
క్వ వా వద గరుత్మతా మధుర మీదృశం శిక్షితం
నిషించసి సుధాయుత శ్శ్రవణయో రిమాం శృణ్వతః.

చ. మలినము నీశరీర మతిమాత్రముగాఁ బరపుష్ట మందుపై
మెలఁగెదు కాననాళి నినుమిక్కిలి గాఢపతత్రిమైత్రితోఁ
బలుమరు వీనులార వినువారల యుల్లము పల్లవింపఁగాఁ
బలికెద వేవిహంగ మిటువంటి సుధామధురోక్తి నేర్పరా?

శ్లో. తూష్ణీం తిష్ఠ చకోర! సంహార గిర స్త్వం కీర! పారావత!
త్వద్వాచో విరమంతు బర్హిణ! భవత్కంఠో౽పి విశ్రామ్యతు
ఏతన్నూతనచూతపల్లవదళగ్రాసోల్లసన్మంజుల
వ్యాహారః కలకంఠ ఏష కిరతి శ్రోత్రే సుధాశీకరాన్.

ఉ. కీరమ! మాటలాడకుము, కేకి! భవద్గళ మెత్తఁబోకు, వా
గ్వారము మాను పావురమ! కాంచుము మూకత నోచకోరమా!
సారతరైకనూతనరసాలకిసాలవిశేషసేవనా
పారమనోజ్ఞరావమునఁ బాడెఁ బికం బమృతంబు గుల్కుచున్.

శ్లో. కాకా వృకా ఘూకబకా శ్చ భేకాః
ప్రణమ్య యుష్మా నిద మేవ యాచే
కోలాహలం మా కురుత క్షమధ్వం
పుంస్కోకిలః కూజతి మంజురావమ్.

క. కాకమ! వృకమా! బకమా!
భేకమ! ఘూకమ! నతించి వేఁడెద మానుం
డీకోలాహలమును బుం
స్కోకిల మదె పంచమమునఁ గూసెడు వినుఁడీ!

శ్లో. తావ త్కోకిల! విరసాన్
యాపయ దివసాన్ వనాంతరే నివసన్
యావన్మిలదలిమాలః
కోఽపి రసాల స్సముల్లసతి.

చ. అలికులమాలికామిలిత మై సువిశాలరసాలవాల మై
లలితరసాలసాలము విలాసములన్ గులికించునన్నఁ గో
కిలము! వనాంతరావసిన కేవలనీరసవాసరావలిన్
మెలమెలఁ బుచ్చుచున్ మెలఁగుమీ కనుమోడిచి యెట్టులెట్టులో.

శ్లో. ఏక స్త్వం గహనేఽస్మిన్
కోకిల! న కలం కదాచి దపి కుర్యాః
సాజాత్యశంకయామీ
న త్వాం నిఘ్నంతి నిర్దయాః కాకాః.

ఉ. కోకిల! యొంటిమై నలకుఁగొమ్మ వసించుచుఁ బోహళింపఁగాఁ
బోకుము కాకలీస్వనము ముద్దులు మూటలు గట్టునట్లుగన్
వీఁక సజాతిశంకలను వీడి దయ న్విడనాడి నిన్నుఁ జీ
కాకు నొనర్చి కాకవినికాయము కాయముఁ జీల్చి చంపురా.

శ్లో. విపినే ఘోరతమేఽస్మిన్
మా కురు పికవర్య! పంచమారావం
కాకావలి రధునా తే
కులాయ మాన్యస్య రాతి ఘోషేణ.

తే. గీ. విజన మైనట్టి యీ ఘోరవిపినమందు
పికమ! సుంతేని నీనోరు విప్పఁబోకు
నీకులాయమున న్మూగి కాకిమూక
చెవులు చిల్లులు వడ గోల సేయఁగలదు.

## 6. శుకము

శ్లో. ఫలవతి పిచుమందే మందబుద్ధే! కథం వా
స్వనసి మధురవాణీం వ్యర్థయన్ రాజకీర!
అతిపరుషరవాణాం వాయసానాం నివాసే
ఽసుమితసహకారప్రాంతభాగం విహాయ.

తే. గీ. కుసుమితరసాలకుజము వీడ్కొని యనూన
పరుషకూజితవాయసావాస మైన
ఫలితపిచుమందమునఁ గీరవర్య! నీవు
చేరి కలరావమును వృథసేయ నేల?

శ్లో. ఉచ్చై రేష తరుః ఫలం చ పృథులం దృష్ట్వా ప్రహృష్టశ్శుకః
శాలిం చాన్యగతం విహాయ నిభృతం తన్నారికేళం గతః
తత్రారుహ్య బుభుక్షితేన మనసా యత్నః కృతో భేదనే
ఽప్యాశా తస్య న కేవలం విగళితా చంచుశ్చ చూర్ణీకృతా.

ఉ. ఉన్నత మీకుజమ్ము ఫలమో పృథులం బని సంతసించి బా
ళి న్నిజచంచుసంపుటవిలీనసుశాలిని వీడి కీర మె
న్నెన్నియొ యత్నముల్ సలిపె నించుక చీల్పఁగ నారికేళముం
భిన్నత నందె చంచుపుటి వేగ వినాశము నందె నాశయున్.

శ్లో. నిఖిలేషు విహంగేషు
హంత! స్వచ్ఛందచారిషు
శుక! పంజరబంధస్తే
మధురాణాం గిరాం ఫలమ్.

ఆ. వె. సకలవిహగరాజి స్వచ్ఛందవృత్తిమై
దశదిశాంతములకుఁ దరలుచుండ
రాజకీర! పంజరమున బంధమే నీకుఁ
గమ్రసూక్తి వలనఁ గలుగు ఫలము.

यदि पूर्वं जरामरणम्, पश्चाज्जातिरित्युच्यते तदा जातिप्रत्ययं जरामरणमिति भगवदुक्तं जातिप्रत्ययत्वं जरामरणयोर्हीयेत। किंच यद्यत्पूर्वं तत्तद्‌हेतुकमिति रीत्या जरामरणयोर्निर्हेतुकत्वप्रसङ्गश्च स्यात्तस्मादयुक्तमेतदिति भावः॥४॥

इदानीं जातिजरामरणानां सहभावोपि न सम्भवतीत्याह—

न जरामरणं नैव जातिश्च सह युज्यते ।
म्रियते जायमानश्च स्याच्चाऽहेतुकतोभयोः ॥५॥

यदि जातिजरामरणानां सहभावस्स्यात्तदा जायमानस्यैव मरणं स्यात् । नचैवं दृष्टं लोके। जायमान एव म्रियत इति । किंचालोकान्धकारवदत्यन्तविरुद्धानां जातिजरामरणानां सहभाव एव न सम्भवति । किंचैतेषां सहभावकल्पने सव्येतरविषाणवत्परस्परमहेतुकतापि स्यादिति भावः ॥५॥

एवं च— यत्र न प्रभवन्त्येते पूर्वापरसहक्रमाः ।
प्रपञ्चयन्ति तां जातिं तज्जरामरणे च किम्? ॥६॥

यत्र जातिजरामरणेषु, एते पूर्वापरसहक्रमा न सन्ति । तामनुपलभ्यमानां जातिं कथं प्रपञ्चयन्त्यार्याः? तज्जरामरणं वा कथं प्रपञ्चयन्ति? अविद्यमानस्य प्रपञ्चनं न कस्यापि सम्भवतीति भावः ॥६॥

यथा संसारस्य पूर्वा कोटिर्नास्ति एवमन्येषामपि भावानामित्याह—

कार्यं च कारणं चैव लक्ष्यं लक्षणमेव च ।
वेदना वेदकश्चैव सन्त्यर्था एव केचन ॥७॥
पूर्वा न विद्यते कोटिः संसारस्य न केवलम् ।
सर्वेषामपि भावानां पूर्वा कोटिर्न विद्यते ॥८॥

तत्र यदि पूर्वं कारणं पश्चात्कार्यं च स्यात्तदा कारणमकार्यकं स्यात्। अथ पूर्वं कार्यं, पश्चात्कारणं स्यात्तदा कार्यं निर्हेतुकं स्यात्। यदि कार्यकारणे युगपत्स्यातां तदा तयोः कार्यकारणभावो न स्यात् । एवमेव लक्ष्यलक्षणे, वेदनावेदकौ च व्याख्येयौ । किंच न केवलं संसारस्य व्याख्यानेन कार्यकारणादिकमेव व्याख्यातं वेदितव्यम् । अपि तु ये त्वन्येपि पदार्थाः ज्ञानज्ञातृ, प्रमाणप्रमेय, साध्यसाधन, अवयवावयवि, गुणगुण्यादयस्तेषामपि पूर्वापरसहक्रमा न सन्तीति वेदितव्यमिति भावः ॥८॥

इति सुबोधिनीव्याख्यासहितमाध्यमिककारिकासु
संसारपरीक्षानामैकादशं प्रकरणम् ।

# माध्यमिककारिकासु,

## दुःखपरीक्षा नाम द्वादशं प्रकरणम् ।

नन्वनुभूयत एव सर्वैरपि दुःखम्, तच्च निराश्रयं न भवतीति त यतया आत्मा सिद्धयतीति चेत्स्यादप्येवं यदि दुःखं स्यात् । तदेव न स तीत्याह—

स्वयं कृतं परकृतं द्वाभ्यां कृतमहेतुकम् ।
दुःखमित्येक इच्छन्ति तच्च कार्यं न युज्यते ॥१॥

तत्रैके वादिनो दुःखं स्वयंकृकमित्यभ्युपगच्छन्ति । अपरे परकृतमि अन्ये द्वाभ्यां कृतमिति । केचिदहेतुकमेव दुःखं वर्णयन्ति । सर्वथा दिष्यमाणं दुःखं कार्यं न भवतीति भावः ॥१॥

प्रतिज्ञातमर्थमुपपादयितुमुपक्रमते—

स्वयं कृतं यदि भवेत्प्रतीत्य न ततो भवेत् ।
स्कन्धानिमानमी स्कन्धाः सम्भवन्ति प्रतीत्य ह ॥२॥

दुःखं हि मरणान्तिकान् स्कन्धान् प्रतीत्य भवति । तद्यदि स्वयं भवेत्तदा स्कन्धान्प्रतीत्य न भवेत् । स्कन्धा अप्यमी प्रतीत्यैव स्कन्धान्त भवन्ति । अतस्स्वयं कृतं दुःखमिति पक्षो न क्षोदक्षम इति भावः ॥२॥

इदानीं परकृतमपि दुःखं नास्तीत्याह—

यद्यमीभ्य इमेऽन्ये स्युरेभ्यश्चान्ये परे यदि ।
भवेत्परकृतं दुःखं परैरेभिरमी कृताः ॥३॥

यद्यमीभ्यो मरणान्तिकेभ्यः स्कन्धेभ्यः अमी आंशिकाः स्कन्धा भि स्युरेभ्यश्चांशिकेभ्योऽन्ये मरणान्तिका भिन्ना यदि स्युः तदानीं दुःखं प भवेत् । यतः परैरेभिर्मरणान्तिकैरमी आंशिकाः कृताः । नचैवम् । तस्मात्पर मपि दुःखं नास्तीति भावः ॥३॥

ननु न ब्रूमो वयं, दुःखेनैव दुःखं कृतम् । अतस्स्वयंकृतमिति । कि स्वपुद्गलेन कृतं दुःखं स्वयं कृतमिति । एवमपि न घटत इत्याह—

स्वपुद्गलकृतं दुःखं यदि दुःखं पुनर्विना।
स्वपुद्गलस्स कतमो येन दुःखं स्वयं कृतम् ॥४॥

येन स्वपुद्गलेन कृतं दुःखं स्वयंकृतमित्युच्यते भवता, स स्वपुद्गलः दुखं विना दुःखातिरिक्तो न सिद्ध्यति। उपादानोपादेययोरव्यतिरेकात्। तथा च येन दुःखेन स्कन्धात्मकेन यत्पुद्गलमारब्धं तेन पुद्गलेन तदेव दुःखमारब्धं चेत्तदा दुःखेनैव दुःखं कृतमि स्यात्। तत्रोक्त एव दोषः। यदिच मनुष्यपुद्गलोपादानेन पुद्गलान्तरेणैव मनुष्यपुद्गलद्वारा दुःखमुत्पादितं,तदा दुःखं स्वयंकृतमिति न शक्यते वक्तुम्। तस्माद्दुःखं स्वयंकृतमित्यनुपपन्नमेव ॥४॥

नन्वस्तु परपुद्गलजमेव दुःखम्, अन्यएव देवपुद्गलान्मनुष्यपुद्गलः, स च मनुष्यपुद्गलो दुःखमुत्पाद्य देवपुद्गलाय ददाति। तथा च देवपुद्गलदुःखं मनुष्यपुद्गलकृतमिति, तत्राह—

परपुद्गलजं दुःखं यदि यस्मै प्रदीयते।
परेण कृत्वा यद्दुःखं स दुःखेन विना कुतः ॥५॥

परपुद्गलजं दुःखमिति यदि कल्प्यते तदा परेण मनुष्यपुद्गलेन यद्दुःखं कृत्वा यस्मै देवपुद्गलाय प्रदीयते स देवपुद्गलो दुःखेन विना कुतः? दुःखरहितो नास्ति। यस्मै देवपुद्गलाय मनुष्पुद्गलो दुःखमुत्पाद्य दास्यति, तादृशो निर्दुःखो देवपुद्गल एव नास्ति। सदुःखे देवपुद्गले मनुष्यपुद्गलेन दुःखदानमित्यव्यसङ्गतं, वैयर्थ्यादिति भावः ॥५॥

इदानीं यश्च ददाति सोपि नास्तीत्याह—

परपुद्गलजं दुःखं यदि कः परपुद्गलः।
विना दुःखेन यत्कृत्वा परस्मै प्रहिणोति तत् ॥६॥

परपुद्गलजं दुःखमिति यदि मतम्, तदा दुःखरहितस्स परपुद्गलो वक्तव्यः। यो दुःखमुत्पाद्य परस्मै प्रहिणोति तादृशः परपुद्गल एव नास्ति। पुद्गलमात्रस्य दुःखसहितत्वादिति भावः ॥६॥

प्रकारान्तरेण प्रतिपादयितुमाह—

स्वयंकृतस्याऽप्रसिद्धेः दुःखं परकृतं कुतः? ।
परो हि दुःखं यत्कुर्यात्तत्तस्य स्यात्स्वयं कृतम् ॥७॥

देवपुद्गलदुःखं मनुष्यपुद्गलकृतत्वात्परकृतमिति यदि मन्यसे तदा तद् दुःखं मनुष्यपुद्गलस्य स्वयं कृतमेव भविष्यति । स्वयं कृतं दुःखं नास्तीत्युक्तं प्राक् । तथा च स्वयंकृतस्याप्रसिद्धेः मनुष्यपुद्गलेन स्वयंकृतस्य दुःखस्याभावात्कुतः परपुद्गलस्य देवाख्यस्य तेन कृतं दुःखं परकृतं स्यात् ॥७॥

इदानीं प्रकारान्तरेण पक्षद्वयासम्भवं प्रतिपादयति—

न तावत्स्वकृतं दुःखं न हि तेनैव तत्कृतम् ।
परो नात्मकृतश्च स्याद्दुःखं परकृतं कथम् ॥८॥

इतश्च स्वपराभ्यां कृतं दुःखं नास्ति । कथम्, न तावत्स्वकृतं दुःखमस्ति । हि यस्मात्तेनैव तत्कृतमिति न शक्यते वक्तुम् । स्वात्मनि वृत्तिविरोधात्। नापि परकृतं दुःखमस्ति । परस्यैवाभावात् । तथा हि, यश्चासौ परो दुःखं करोतीति परिकल्प्यते स तावन्नात्मकृतः,नात्मना स्वयंनिष्पन्नः,स्वात्मनि क्रियाविरोधात् । तस्यापि हेत्वन्तरापेक्षायामनवस्था । एवंच यः स्वात्मना न निष्पन्नः, अविद्यमानत्वात्स कथं परं निष्पादयति । तस्मात्परकृतमपि दुःखं नास्तीतिभावः॥

उभयकृतं दुःखं, अहेतुकं दुःखमिति पक्षद्वयं निराकर्तुमुपक्रमते—

स्यादुभाभ्यां कृतं दुःखं स्यादेकैककृतं यदि ।
पराकारं स्वयंकारं दुःखमाहेतुकं कुतः? ॥९॥

यदि दुःखमेकैककृतं स्यात्तदानीमुभाभ्यामपि कृतं भवेत । दुःखमेकैककृतमिति पक्षस्त्वनुपदमेव दूषितः । तस्मादुभाभ्यां कृतं दुःखं नास्ति । इदानीं निर्हेतुकमपि दुःखं नास्तीत्याह— **पराकारमिति** । परेणाकार आकरणं यस्य तत्पराकारं, परकृतमित्यर्थः । स्वयं कारः कारणं यस्य तत्स्वयंकारम् । स्वकृतमिति यावत् । तथा च परकृतं, स्वयंकृतं वा दुःखं नास्ति यस्मात्तस्मात्खपुष्पायमाणं दुःखमाहेतुकमित्यपि न शक्यते वक्तुम् । यदा च दुःखमेव नास्ति तदा तदाश्रयतया आत्मनस्सिद्धिरपि दूरापास्तेति भावः ॥९॥

यथा च चतुर्धा विचार्यमाणं दुःखमसदेवं बाह्या अपि बीजांकुरादयो भावा अपि वेदितव्या इति प्रतिपादयन्नाह—

न केवलं हि दुःखस्य चातुर्विध्यं न विद्यते ।
सर्वेषामपि भावानां चातुर्विध्यं न विद्यते ॥१०॥

यथाच विचार्यमाणे दुःखस्य चातुर्विध्यं नास्त्येवमेव बाह्यानां घटपटादीनामपि भावानां चातुर्विध्यं नास्तीत्यवसेयम् । यदा चैवं तदा विपर्यासलब्धसत्ताकाना-मेतेषामविद्याभूमावेव प्रतीत्यसमुत्पाद इति भगवतोऽभिप्रायः ॥१०॥

इति सुबोधिनीव्याख्यासहितमाध्यमिककारिकासु
दुःखपरीक्षानाम द्वादशं प्रकरणम् ।

---

सुबोधिनीव्याख्यासहित-

# माध्यमिककारिकासु,

## संस्कारपरीक्षानाम त्रयोदशं प्रकरणम् ।

ननु सन्ति संस्काराः, तदाश्रयतया आत्माप्यस्ति, इति चेत्तत्राह—

सर्वे च मोषधर्माणस्संस्कारास्तेन ते मृषा ।
प्रप्रोक्तं तन्मृषा मोषधर्मं यदपि संस्कृतम् ॥१॥

यतश्च समनन्तरातिक्रान्तप्रकरणोक्तदिशा भावानां स्वपरोभयकृतत्वमहेतुस-मुत्पन्नत्वं च निरूप्यमाणमसदतस्सर्वे संस्कारा मोषधर्माणः, निस्स्वभावा एव वि-द्यमानवदवभासन्त इत्यर्थः । यत एवमतस्ते मृषा, मिथ्याभूता एव । न के-वलं संस्कारा एव मृषा, किं तर्हि 'एतदपि खलु भिक्षवः परमं सत्यम्, यदिद-ममोषधर्मनिर्वाणं तन्मृषा मोषधर्मं यत्" इत्यादिना भगवता सूत्रे यदुक्तं संस्कृतं तदपि मोषधर्मत्वान्मृषैवेति भावः ॥१॥

अत्राह कश्चित्पूर्ववादी—

तन्मृषा मोषधर्मस्स्याद्यदि किं तत्र मुष्यते ।
एतदुक्तं भगवता शून्यतापरिदीपकम् ॥२॥

ननु मोषधर्मत्वेन मृषात्वं प्रतिपादितं सर्वभावानां, यदि सर्वे भावा मृषा स्युस्तर्हि किं तत्र मुष्यते? यदिकश्चिद्भावो भविष्यति तदा तत्र मोष इति शक्यते वक्तुम् । यदा तु भाव एव नास्ति तदा कुत्र किं मुष्यत इति चेदत्रोच्यते—'तन्मृषा मोषधर्मं यत्' इत्याद्यागमेन भावानामभावदर्शनं न प्रतिपाद्यते । किं तु भावानां निस्स्वभावत्वं यदुक्तं बुद्धेन तच्छून्यतायाः परिदीपकत्वेनैवोक्तम् । यदा तु प्रागुक्तरीत्या भावानां निस्स्वभावत्वमेव सिद्ध्यति तदा भावाभिमानं मुक्त्वा शून्यभावनायामेकाग्रं भवति चित्तमिति भावः ॥२॥

अत्राह कश्चित्, ननु नायमागमश्शून्यतां परिदीपयति, किं तर्हि अनवस्थितस्वभावत्वरूपं निस्स्वभावत्वमेव । तथा हि—

भावानां निस्स्वभावत्वमन्यथाभावदर्शनात् ।
नाऽस्वभावश्च भावोऽस्ति भावानां शून्यता यतः ॥३॥

विचार्यमाणानां भावानामन्यथाभावदर्शनात्, परिणामदर्शनात्, निस्स्वभावत्वं, अनवस्थितस्वभावत्वमेव । यदि भावानां शून्यतैव स्यात्तदा अन्यथाभावो न स्यात् । दृश्यते चान्यथाभावः । तस्मादनवस्थितस्वभावत्वमेवागमार्थ इति विज्ञेयम् । इतश्चैतदेवं विज्ञेयम्—यदा च भावानां शून्यतेष्यते तदा निःस्वभावा भावा इति प्राप्तम् । निस्स्वभावश्च भावो नास्ति । तथाच धर्मिण्यसति कस्य शून्यता नाम धर्मस्स्यादिति भावः ॥३॥

अपि च—

कस्य स्यादन्यथाभावः स्वभावश्चेन्न विद्यते ।
कस्य स्यादन्यथाभावः स्वभावो यदि विद्यते ॥४॥

यदि भावानां स्वभाव एव न स्यात्तदा विपरिणामलक्षणोऽन्यथाभावः कस्य स्यात् । न कस्यापीत्येवं प्राप्ते प्रतिसमाधीयते— इह यो धर्मः यं भावं न व्यभिचरति स तस्य स्वभाव इत्युच्यते । यथाऽग्नेरौष्ण्यम् । तदेवौष्ण्यं परम-

स्वयसम्भूतं कृत्रिमत्वाज्जलादीनां न स्वभावः। एवं च भावानां यदि स्वभावस्स्याचदा परिणामलक्षणोऽन्यथाभावो न स्यात्। उपलभ्यते चान्यथाभावः। तस्मान्नास्ति भावानां स्वभाव इति भावः ॥४॥

यथा चान्यथाभावो न सम्भवति तथा प्रतिपादयन्नाह—

**तस्यैव नान्यथाभावो नाप्यन्यस्यैव युज्यते।**
**युवा न जीर्यते यस्माद्यस्माज्जीर्णो न जीर्यते ॥५॥**

तस्यैव प्रागवस्थायां वर्तमानस्य भावस्यान्यथाभावो न सम्भवति। तथा हि, यून अप्राप्तजरावस्थस्य युवावस्थायामेव वर्तमानस्याऽन्यथाभावो जरावस्थासम्बन्धो न सम्भवति, युगपद्विरुद्धावस्थाद्वयप्रसङ्गात्। एवं जीर्णोऽपि जरावस्थायां वर्तमानोऽपि न जीर्यते। एकत्र जरावस्थाद्वयाङ्गीकारे प्रयोजनाभावात्। एवं तावत्तस्य वाऽन्यस्य वाऽन्यथाभावो न सम्भवतीति भावः ॥५॥

अपि च—

**तस्य चेदन्यथाभावः क्षीरमेव भवेद्दधि।**
**क्षीरादन्यस्य चार्थस्य दधिभावो भविष्यति ॥६॥**

तस्याऽपरित्यक्तपूर्वावस्थस्यैव भावस्यान्यथाभावः स्याच्चेत्तदा क्षीरमेवाऽपरित्यक्तपूर्वावस्थं दधि भवेत्। नैतद्युक्तम, दधिक्षीरयोर्भेदात्। क्षीरादन्यस्य भावस्य दधिभाव इत्यपि न युक्तम्, उदकादिभ्यो दध्नोऽनिष्पत्तेः। तस्मात्तस्य वान्यस्य वाऽन्यथाभाव इत्यसङ्गतमेव। एवं भावानां सत्स्वभावत्वं न सेत्स्यतीति भावः ॥६॥

ननु शून्यतेष्यते भवता भावानां, तथा च तदाश्रयतया भावस्वभावाः भावास्सन्तीति चेन्नैतद्युक्तमित्याह—

**यद्यशून्यं भवेत्किञ्चित्स्याच्छून्यमिति किञ्चन।**
**न किञ्चिदस्त्यशून्यं च कुतश्शून्यं भविष्यति ॥७॥**

यदि शून्यतानाम धर्मस्स्यात् स्यादेव तदाश्रयतया भावस्वभावोऽपि भावः। सैव नास्ति। इह हि शून्यता नाम सर्वभावानां सामान्यलक्षणमित्यभ्युपगतं संवृतावस्थायाम्। एवं च यदाऽशून्यो भाव एव नास्ति, तदाऽऽश्रयाभावादशून्य-

तापि नास्ति। यदा चाशून्यता नास्ति, तदा प्रतिपक्षहीनं शून्यत्वमपि नास्ति। एवं च शून्यत्वाऽशून्यत्वविनिर्मुक्तं, निस्तरङ्गं निर्वाणमिति हृदयम् ॥७॥

ननु त्रीणि विमोक्षमुखानि– शून्यता, अनिमित्ता, प्रणिहिताख्यानि विमुक्तये विनेयेभ्यो भगवता निर्दिष्टानि। अधुना भवान् तथागतवचनव्याख्यानव्याजेन तामेव शून्यतां प्रतिक्षेप्तुमारब्धवानिति चेदत्रोच्यते—

शून्यता सर्वदृष्टीनां प्रोक्ता निस्सरणं जनैः।
एषां तु शून्यता दृष्टिस्तानसाध्यान्बभाषिरे ॥८॥

इह शून्यतानाम सर्वेषां दृष्टिकृतानामभिनिवेशानां निस्सरणं निवृत्तिरेव। ये तु तस्यामपि शून्यतायां भावाभिनिवेशं कुर्वन्ति तानसाध्यान्, अचिकित्स्यान्, अप्रबोध्यानिति यावत्, बभाषिरे जनाः। निवृत्तिरूपायां शून्यतायामस्तित्वबुद्धिं ये कुर्वन्ति, तेऽत्यन्तं निहीनप्रज्ञा इति भावः ॥८॥

इति सुबोधिनीव्याख्यासहितमाध्यमिककारिकासु
संस्कारपरीक्षा नाम त्रयोदशं प्रकरणम्।

---

सुबोधिनीव्याख्यासहित-

# माध्यमिककारिकासु,

## संसर्गपरीक्षानाम चतुर्दशं प्रकरणम्।

ननु चक्षुः प्रतीत्य रूपाणि चोत्पद्यन्ते। चक्षुर्विज्ञानं, त्रयाणां सन्निपातः स्पर्शः। स्पर्शसहजा वेदनेति, तथा–'संज्ञा च वेदना च संसृष्टावेतौ धर्मौ'विति च संसर्गोपदेशादस्त्येव भावस्वभाव इतिचेदुच्यते। संवृत्त्यपेक्षयाऽयं संसर्गो भगवतोपदिष्टः, न परमार्थतः। कथमिति चेदुच्यते—

द्रष्टव्यं दर्शनं द्रष्टा त्रीण्येतानि द्विशो द्विशः।
सर्वतश्च न संसर्गमन्योन्येन व्रजन्त्युत ॥१॥

| | |
|---|---|
| 30. నీతిభవనము | 0- 4.0 |
| 31. పరిషత్పుస్తకభాండాగారము 2వ భాగము | 1- 0-0 |
| 32. ,, 3వ భాగము | 1. 0.0 |
| 33. ప్రాకృతభాషోత్పత్తి-శ్రీమాన్ మే. వెం. రమణాచార్యులుగారు | 0.12.0 |
| 34. బాలభారతము.(అగస్త్యకృతమునకుఁ దెలుఁగు) | 1. 8-0 |
| 35. మన్నారుదాసవిలాస నాటకము-రంగాజమ్మ | 0-12-0 |
| 36. యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము | 1. 0.0 |
| 37. రసాభరణము-అనంతకవి | 0.12.0 |
| 38. రసార్ణవాలంకారము—ప్రకాశవర్షకవి | 0. 8-0 |
| 39. రఘునాథ రామాయణము (ప్రథమభాగము) | 0.12.0 |
| 40. రజతోత్సవసంపుటము (ఆంధ్రసాహిత్యపరిషత్తు) | 1- 8.0 |
| 41. రాయవాచకము-విశ్వనాథనాయని స్థానపతి | 1. 0.0 |
| 42. రాధికాసాంత్వనము-సముఖము వేంకటకృష్ణప్పనాయకుఁడు | 1. 0.0 |
| 43. రేనాటి రెండు శాసనములు | 0. 8.0 |
| 44. లక్షణసారసంగ్రహము | 1. 0-0 |
| 45. విప్రనారాయణ చరిత్రము-చదలవాడ మల్లన్న | 1- 0-0 |
| 46. లౌకికన్యాయవివరణము.శ్రీమాన్ మే. వెం. రమణాచార్యులుగారు | 0.12.0 |
| 47. శతకసముచ్చయము (మొదటిభాగము) | 1. 0.0 |
| 48. ,, (ద్వితీయభాగము) | 1. 0.0 |
| 49. శాసనపద్యమంజరి (మొదటిభాగము) | 1. 0.0 |
| 50. ,, (ద్వితీయభాగము) | 0. 8- |
| 51. శివరాత్రిమాహాత్మ్యము-శ్రీనాథమహాకవి | 1. 4. |
| 52. షోడశకుమార చరిత్రము-వెన్నెలకంటి అన్నమయ్య | 1. 0. |
| 53. సర్వేశ్వర శతకము-యథావాక్కుల అన్నమయ్య | 0. 4- |
| 54 స్వప్నవాసవదత్త-భాసకృతి కనువాదము | 1. 6. |
| 55. సాంబోపాఖ్యానము-రామరాజు రంగప్పరాజు | 1. 0. |
| 56. సింహాసనద్వాత్రింశిక-కొఱవి గోపరాజు | 1- 0. |
| 57. ,, (ద్వితీయభాగము) | 1. 0. |
| 58. ఈశానసంహిత | 0. 8. |
| 59. ప్రాస్తావిక పద్యావళి | 0- 8. |
| 60. 42-వార్షికమహాసభ-వ్యాసములు- 250 పుటలు | 1- 8. |

